

"చూ కండి, మీ అమ్మాయిని మా వాడికి చేసుకో.."

"అలాగే! మీ వాడితో మా అమ్మాయి లేచిపోయింది నిన్న ఆ సంగతి చెప్ప టానికే నే వచ్చాను"

కలసి పేకాట ఆడుతున్నాడు అందరి ముందూ వందలూ, పదులూ క ట్టలు కట్టలుగా వున్నయ్ వాళ్ళకి చిల్లరతో పనే లేనట్టుంది నే వెళ్ళి మా మిత్రుని వెనుకగా ఓ కుర్చీలో కూర్చుని ఊపిరి పీల్చుకున్నాను చెమటను లుంగీ పంచె అంచుతోనే తుడుచుకుంటూ — చ ట్టూ చూచాను ఒక టేబుల్ దగ్గర నలుగురు పెద్దమనుషులు విస్కీ బ్రాందీల వంటి పానీయాలు సేవిస్తూ — సిగరెట్లందించే కుర్రాణ్ణి డేన్స్ చేయమని నిర్బంధిస్తు న్నారు వాడు తెల్లబోయి, వాళ్ళిస్తున్న రూపాయి నోట్ల కోసం తైతెక్కలాడు తున్నాడు మరోమూల నలుగురు చిల్లర డబ్బులతోనే అడ్డాట ఆడుతున్నారు ఇంకోమూల పదుగురుచేరి రాజకీయ భవిష్యత్తుమీదే పందేలు కడుతున్నారు

ఇంతలో మా మిత్రుడు "మైగాడ్ — ఇదీ ఆల్ కౌంటే" అంటూ మూర్ఛ బోయినట్టుగా పేకముక్కలు వదిలేసి,

వెనక్కి వాలిపోయాడు వాడి ముందున్న నోట్ల కట్టను ఎదుటివాడు స్వంతం చేసుకున్నాడు నేను అక్కడ ఇక వుండలేక పోయాను నే లేచే సరికి మిత్రుడు చూచినట్టున్నాడు. "హల్లో మూర్తీ! ఎంత సేపయిందిరా వచ్చీ? ఇందాక నే పిలిచినా రానంటివే? రా, రా. .ఒక రౌండ్ ఆడదాం. డబ్బు తియ్ మనం క్షవరంలే." అంటూ చేతుల్తో నా జేబులు తడుమసాగాడు అబ్బ! కంపు!! బాగా తాగినట్టున్నాడు

నేను "ఏమీ తోచక వచ్చాన్లేరా! నాదగ్గరేం లేదుగాని — ఈ పాడు పేకాట ఎందుకు, పోదాం పద" అని, వాణ్ణి బైటికి లాక్కువచ్చాను వాడి ఎగతాళీ, వాగుడూ వినిపించుకోకుండా — వాడి కారులోనే ఎక్కించి, నేను డ్రైవ్ చేసుకుంటూ, వాణ్ణి వాళ్ళింటివద్ద దింపేంత వరకూ నాకేదో జ్వరం ముంచుకొచ్చినట్లే వుంది వాణ్ణి దింపి ఇంట్లోకి పంపిన తర్వాత — "కారుతో కొంచెం పనుంది — నే తీసుకెళుతున్నారా బ్రదర్" అని కేక వేసి, వాడి జవాబు వినకుండానే — మళ్ళీ రోడ్లవెంట పడ్డాను మళ్ళీ ఎంత సేపు రోడ్లు సర్వే చేశానో తెలియదు

కారు తారురోడ్లమీద జర్రున జారిపోతుంటే — నా మెదడులో మళ్ళీ రాత్రి జరిగిన సంగతులే సుళ్ళు తిరుగుతున్నయ్ నే నంతంత మాట లంటుంటే సుశీల ఎట్లా భరించిందా అని ఆశ్చర్యంగావుంది చిన్నప్పుడు నేనేమీ అనకపోయినా తన తలిదండ్రులతో చెప్పి శిక్షవేయించిన పిల్ల, పెద్దదై సరసాలుకూడా సహించలేక ముఖం చిట్లించే యువతి, అభిమాన ఆత్మగౌరవ దృష్టు లెక్కువగా గల ఆధునిక గృహిణి — ఆ సుశీల. తన స్నేహితురాలి ఎదుటనే, భర్త అంతంత మాట లంటూంటే ఎందు కూరుకుంది? ఎదురుతిరిగి ఏ ఒక్క మాటన్నా నే న్నోరుమూసుకునే వాణ్ణేగా? రెండేళ్ళనుంచీ నాతో కాపురం చేస్తూ కూడా నా ధోరణులు గుర్తించలేనంత పిచ్చిపిల్లా!

అదుగో — మళ్ళీ నా పురుషాహంకారం తలెత్తినట్లుంది ఎంతో తెలివిగల వాడననుకునే నేనే ఆమె నర్థంచేసుకున్న వాడి ననుకుంటూ కూడా, ఇప్పుడర్థంచేసుకోనట్టు గ్రహించాను గదా! ఇక పుట్టు భోగిగా, అల్లారుముద్దుగా పెరిగిన, అయినింటి ఆడపడుచు సుశీల నన్నర్థం చేసుకోలేని పిచ్చిదనుకోవడం ఎందుకూ?

అవును! నేను మొదటినుంచీ సుశీలను అపార్థమే చేసుకుంటున్నానేమో అనిపిస్తూంది ఆమె తలిదండ్రులు, మా స్థితిగతులుచూచి జాలిపడైనా సాయపడక పోవడం తప్పని బంధు మిత్రులంతా పదేపదే అనేవారు నేను లోకరీతి ప్రకారం అంతేగావల్ను అనుకునేవాణ్ణి గాని — ఏనాడూ ఆత్మతః వాళ్ళను ద్వేషించి ఎరుగను, కోపం తెచ్చుకుని ఎరుగను నేను బి. యే చదివే రోజుల్లో కూడా —

రాత్రులు ట్యూషన్స్ చెప్పుకునీ, మిత్రుల యిండ్ల వారాలుచేసుకునీ బ్రదికానేగాని- భాగ్యవంతులైన మేనత్తగా రేదో పెట్టా లని దేబిరించినవాణ్ణి కాదు కాకపోతే - బంధుప్రీతితో సాలు కొకసారైనా వెళ్ళి వచ్చే వాణ్ణి

అలాంటప్పుడు సుశీల నాతో మామూలు చనువుగానే మసిలేది. వాళ్ళ అమ్మా నాన్నా కసురుకున్నా నాతో ఎక్కువగా మాట్లాడుతూ, లోకాభిరామా యణం చర్చించుతూ - రేయింబవళ్లు నా దగ్గరే గడిపేది చిన్నపిల్లలాగానే కథలవీ చెప్పమనేది ''అమాయకురాలు' అంతటి భోగభాగ్యాల్లో పుట్టి, ఇంతటి తల్లి శిక్ష ణలో పెరిగి, హాస్టల్లో వుంటూ బి యే. చదువుకుంటున్నా సుశీల అమాయకపు పిల్లగానే వుండిపోయింది'' అనుకునే వాణ్ణి నా కొక్కోసారి జాలి కూడా వేసేది - యుక్తవయసు మీరిన పిల్ల, ఇప్పటికీ కథలకోసం చెవిగోసుకోవడం, ఎంత చుట్టాన్నయినా రాత్రులు కూడా నా దగ్గరలోనే పడుకుంటాననడమూ గమనించి

అలాంటి పిల్ల బి యే చదివినా ప్రేమాగత్రావంటి వ్యవహారాల్లో పడ లేదంటే - చాలా మందికి ఆశ్చర్యం వేసింది గాని, నాకు చాలా సహజమేనని తోచింది అందువల్లనే తలిదండ్రులు తనకు బైటి సంబంధాలు చూస్తున్నా సుశీల వద్దనలేదు నన్ను చేసుకోమన్నా కాదనలేదు నేనే ఆవిడ క్షేమంకోరి ఏవేవో అభ్యంతరాలు చెప్పాను మా మేనత్తా మామయ్యా వచ్చి బ్రతిమాలు కున్నా రెండు నెల్లు వాయిదాలు వేస్తూ వచ్చాను

అప్పటికి నేను మా మిత్రుని కంపెనీలో విశాఖపట్నంలో పెద్ద ఉద్యోగమే చేస్తున్నా నెలకైదువందల జీతం బంధు మిత్రులు దానికే ఈర్ష్యపడేవారు అయినా మా మేనత్త తన కూతుర్ని అంత కట్నంతో నాకిచ్చి పెళ్ళి చేస్తా నంటే నాకు నమ్మకం కుదరలేదు నాకంటే వందరెట్లు మెరుగైన సంబం ధాలు తేగల వాళ్ళు, వెనకా ముందూ ఏమీలేక - వుద్యోగంమీద మాత్రమే బ్రదికే నాకోసం రావడం ఏమిటి ? అమాటే అన్నాను వాళ్ళు 'మేనరికం' అన్నారు - అదే ముఖ్యమన్నట్లు ఆనాటి వరకూ లేని మేనరికపు వాత్సల్యాభి మానాలు ఆనా డెందుకో అర్థంకాలేదు - అప్పటికే - మా కంపెనీ ఓనరు నాకు పావలా వాటా రాశాడని నా కానాటికి తెలియదు.

తన కళ్ళెదుట హీనస్థితిలో పెరిగిన నేను, తన తలిదండ్రులతో తిట్లూ మొట్టి కాయలూ తిన్న నేను, తనను ఎత్తుకుని పాలేరులా తిరిగిన నేను - సుశీలకు భర్తగా భరించదగిన వాడనని ఆమె ఎలా ఊహించుకోగలదూ ? ఒక వేళ తలి దండ్రుల మాట కాదనలేక నన్ను పెళ్ళి

వేసుకున్నా - నా వద్ద భార్యగా మెలగ లేక, ఎంత మానసిక సంక్షోభానికి గురౌతుందోనని నేను బాధపడ్డాను. ఒక వేళ నా మీద ఎప్పటివలెనే పెత్తనం చెలాయించే ధోరణిలో గయ్యాళిగంప అవుతుందేమోనని భయం పడ్డానుడాకూ అందుకే అభ్యంతరాలెన్నో చెప్పాను. ఈ అభ్యంతరం వచ్చేసరికి సుశీల తన స్నేహితురాలి ద్వారానూ, తను స్వయం గానూ నా కెన్నో హామీ మాటలు చెప్పింది

ఆఖరుకు మా అమ్మ ఈ పెళ్ళి చేసు కోకపోతే తను చస్తానని ఒట్టు పెట్టు కుని - నా మెడలువంచి వప్పించింది అమ్మ మాటకోసం ప్రాణాలైనా అర్పించ వలసిన నేను వప్పుకోక తప్పలేదు పెళ్ళి జరిగింది అయినా - సుశీల నన్ను భార్యగా సుఖపెట్టలేదనీ, నే నామె గారాల పెంపుకు తగిన గౌరవాన్నివ్వని పురుషుడినై బాధపెట్టవచ్చుననీ భయపడి పోయేవాడిని

కాని - శతవిధాలా, శాయశక్తులా సుశీలను సుఖపెట్టాలనీ, గౌరవ భంగం కాకుండా స్నేహితురాలిని చేసుకోవాలనీ భర్తల్లో సహజంగావుండే అధికారమేదీ ప్రదర్శించరాదనీ, మా సంసారం సకల సంతోషాలతో శాంతియుతంగా సాగు తున్నట్టు మా యిరువురి తలిదండ్రులూ తృప్తిపడేట్టు పవర్తించాలనీ నిశ్చ యించుకున్నాను సుశీల కూడా ఆ నిశ్చ యంతోనే వున్నట్టు నాతో సహకరిస్తు న్నది తన ఖర్చులనేవి లేకుండా మావు కుంది క్రమంగా స్నేహితులతో సిని మాలకు వెళ్ళే ఖులాసా కూడా వదులు కుంది నే డబ్బిచ్చి ప్రోత్సహించినా నగలూ, చీరెలూ ఖరీదైనవి కొనడం తగ్గించేసింది నన్ను ఎంతో సంతోష పెడుతూ మధురానుభూతులు అంది స్తున్నది

పైగా తనొక దాసీదైనట్టు నాకు ఏమేమో అమర్చిజూస్తున్నది ఎందరో పనివాళ్ళుండగా తనే నాకన్నీ అమర్చా లనుకోడం, నా బూట్లు కూడా తుడవా లనుకోవడం దేనికి ? వంటవాడుండగా ఎన్నడూలేంది తను చెయి కాల్చుకోడం దేనికి ? కారుల్లో తిరిగిన తను, కారును నాకోసం పంపి - ఏ పేరంటానికైనా రిక్షాలో వెళ్ళే ఖర్మేంబట్టింది నే నెన్న డైనా నా కంటె తావింత లొజ్జుగావుండా లని సూచించినవాణ్ణి కాదే మా మేనత్త గారి ముద్దుల కూతురుగా ఆదినుంచీ నాలో ఆమెపట్ల పెరిగిన గౌరవభావం- నేను తగ్గించుకోలేదే ? మరి - ఎందుకీ తపన ?

ఏమోగాని - ఇటీవల సుశీల మరీ మారిపోతున్నట్టుంది కారణం చెప్ప కుండా విసుక్కోడం, చిరచిరలాడ్డం, అలగడం, ఏమీ చెప్పకుండా ఏడ్వడం ఎక్కువయింది నే నేం కానిపని చేస్తు న్నానో అర్థంకాక చస్తున్నాను ఈ



"ఈ ఎర్రగుడ్డలన్నీ పంచేస్తాం! రేపు నల్లరంగు వేయించు."

రెండేళ్ళ కాపురంలోనూ సుశీలను తప్పు పట్టగల అంశం దొరక్కపోయినా - ఇటీవలి ఈ ప్రవర్తనే నా కాందోళన కరంగావుంది. గత రాత్రి, అంతకు ముందలి మధ్యాహ్నం ఆమె ప్రవర్తించిన తీరుకు నేనింత కంటే ఏం అర్థం చేసుకోనూ? ఏ తప్పులేని తాను వ్యధపడ్డం దేనికి, నన్ను వ్యధపెట్టడందేనికి?

ఇట్లా ఆలోచిస్తూండగానే భళ్ళున తెల్లవారి. ఎర్రని సూర్యోదయం అయింది. రాత్రంతా నిద్ర లేదేమో కళ్ల చిడతలు గమ్మినట్లయి - కారుకు బ్రేకు వేశాను అప్పటికిగాని, నేను మా బిజినెస్ ఆఫీసుముందే కారునాపానని గుర్తించలేకపోయాను

## 14

తెల్లవారినా, రూము ప్రొద్దెక్కినా వారు ఇంటికి తిరిగి రానేలేదు - రాత్రి అంత ధైర్యం చెప్పిన రాధికకూడా ఈ పూట ఆందోళనపడుతున్నది. గౌరమ్మ సంగతి సరేసరి - మాటిమాటికీ వాకిట్లోకి వెళ్ళి, తెల్లమొహం వేసుకు వస్తున్నది. బిక్కుబిక్కు మంటున్నదేగాని నాతో ఏమీ అనలేకపోతున్నది. పాపం, నేనంటే అంత భయం దానికి! హుఁ - సిగ్గులేనట్టుంది నాకు-నన్ను చూచి ఎదుటివారు భయపట్టం, గొప్ప అనుకుంటున్నట్టున్నాను. నే నొకర్ని భయపెట్టాలనే వుద్దేశంతో ప్రవర్తించడంలేదే?! ఉద్దేశం వున్నా లేకపోయినా, పరోక్షంగానైనా ఒకరికి నావల్ల భయభ్రాంతి కలుగుతున్నదనేదే గమనించవలసిన విషయం గదా!

నామనసెలాంటిదైనా-మాటలూ చేష్టలూ ఎదుటివాళ్ళనంత భయపెడుతూన్నాయన్నమాట? సందేహం లేదు -

ఆయనకూడా నా ముఖంచూచి, నా మాటలువిని, తాము చెప్పబోయే మాటలూ, చేయనున్న పనీ మానుకోడం తరచుగా జరుగుతూనే వుంది అంటే - నా మనసు ముఖంలో ప్రతిఫలించడం లేదన్నమాట మనసు ఎలా వున్నా ముఖం భయపెడుతున్నదన్నమాట

వారి అదృష్టం ఏమిటో - ఏ క్షణానా కోపం కనుపించదు అందుకే బంధు మిత్రులేగాక, ఆఫీసులో నౌకర్లుకూడా ఆయన ముఖం చూస్తేనే దణ్ణంపెట్ట బుద్ధవుతుందంటారు "మూర్తిగారు మారాజుగదండీ, ధరమరాజు" అని మురుసుకుంటారు ఆయన అడుగు జాడల్లో నడుద్దామని మాత్రమే అహర హమూ తహతహలాడుతున్న నేను అంత మంచిమాట సంపాదించుకోలేక పోగా నా ముఖం చూస్తేనే అందరూ ముడుచుకుపోయేట్టు చెయ్యడం-నా దుర దృష్టంగాక ఏమనుకోనూ ?

రాత్రి అలా అలిగి వెళ్ళిన వారు ఇంతవరకూ ఎక్కడున్నారో ఏమో ? వెదుకుదామన్నా, ఎక్కడని ? ఇదే మన్నా సినిమా కథా - వీధులవెంట చింపిరి జుట్టేసుకుని పరుగులుదీస్తే ఏ మూలనో హీరో హీరోయిన్లు ఢీకొని కలుసుకోడానికి ? ఇది వాస్తవ జీవితం, లోకంతో ముడిపడ్డ ఆధునిక జీవిత మాయె వీధిలో ఎవరే కారణంగా ఆందోళనతో కనుపించినా - తతిమ్మా లోకమంతా వేయికళ్ళు చేసుకుచూస్తూ లక్ష రకాల ఎగతాళి జేయడానికే సిద్ధ మయ్యే జీవితమాయె !

రాధిక బలవంతంమీద కాఫీ తాగ వలసివచ్చింది అది కషాయంలా కడుపులో దేవుతున్నది ఈ ఆందోళన సమయంలో రాధిక కూడా ప్రక్కన లేకపోతే ఏమైపోయేదాన్నో ? గుండెలు అవిసి ఏం పిచ్చిపని చేసేదాన్నో ఒకరి చేత వీసమెత్తు మాటపడని మగవారిని భార్యే మాటలని - అదీ నిష్కారణంగా రభసజేసి - వీధులపాలుజేసిన తర్వాత ఆ ఆడది బ్రదికెందుకూ ? చచ్చినా ఆ స్త్రీకి నిష్కృతి వుండదనిపిస్తున్నది రాధిక మాటలు నన్నీ వూహలు కొన సాగనీయకుండా మళ్ళిస్తున్నాయి

చివరికి - తెల్లవారిన తర్వాత ఏ వందోసారో రాధిక మళ్ళీ అడిగింది. "ఇంతకీ నిన్నమధ్యాహ్నం నువ్వంతగా శోకించడానికీ, వడ్డించిన విస్తరిమీద వ్యంగ్యాలు విసరడానికీ కారణం ఏమిటో చెప్పవా సుశీ ? నాకోసం కాకపోయినా, నీ మనసుకు నువ్వు సమాధానం చెప్పు కోక తప్పదు ఆత్మ పరిశోధనద్వారా ఆ మూలకారణం తెలుసుకుంటేగాని - నీ భవిష్యత్తులో ఇలాంటి పొరపొచ్చాలు మళ్ళీ రాకుండా జాగ్రత్త పడలేవు సుశీ" అని హెచ్చరించింది

నేను ఆ పనిలోనే వున్నానని ఈ రాధిక కెలా చెప్పను ! ఈ స్నేహితురాలి సాన్ని

హిత్యంవల్ల నా కెంతటి ఊరట కలుగుతున్నా. నా ఈ ప్రవర్తనను గురించి సిగ్గువిడిచి చెప్పగలనా!

రాధిక చాలా సేపు నా జవాబుకోసం ఎదురు చూచినట్లుంది ఆఖరికి లేచి వెళ్ళబోతూ, "సరే - నీ యిష్టం భర్త చెప్పిందే వినని దానివి, నా మాట వింటా వనుకోవడం నా వెర్రేలే...వెళ్ళొస్తా'' నంది ఆమె ఆ మాటలన్న తీరు నన్ను భయ విహ్వాలను చేశాయి తటాలున లేచి రాధికను నాసోఫాలోకి లాక్కుంటూ "నువ్వు అలక్కు రాధికా! నాకింకెవరున్నా రీ లోకంలో...ఒక్కసారి క్షమించి నా మాట విను" అని కూచోబెట్టుకున్నాను క్షణం ఆలోచించి చెప్ప సాగాను

"నేను చేసిందానికి అర్ధమేమిటో ఇదమిద్ధంగా చెప్పలేకపోతున్నాను కాని... మూలకారణం వెదకడంకోసం నువ్వన్నట్లే ఆత్మ పరిశోధన చేసుకుంటున్నాను అలాంటి ప్రయత్నమే ఈ అనర్ధాలకు దారి తీసిందంటే నువ్వు నమ్మలేవు రాధికా మచ్చుకి ఒక్క సంఘటన చెబుతాను. నిన్నటి ఉదయం జరిగిందే. విను.

"నిన్న ఉదయం ఏడు గంటలకు కాఫీ తాగుతూండగానే మీ అన్నయ్యగారికి ఎవరో ఫోన్ చేశారు ఏదో వ్యాపార వ్యవహారమట ఆయన వెంటనే బైటికి వెళ్ళిపోయారు. రోజూ 10 గంటలకే భోంచేసే వారు. 11 గంటలవరకూ రాకపోయేసరికి నాకు మనసు పాడైపోయింది. నాయర్ మాత్రం నన్ను తినమనీ, ఆయనేదో వ్యాపారం పనిమీద వెళ్ళినపుడు ఏ వేళకు వస్తారోలెమ్మనీ వేధించుకు తిన్నాడు తన కవతల ఏదో పనివుందని కూడా గొణుగుతున్నాడు నాకు చిరాకు వేసింది నేనిప్పుడు తినను లెమ్మని కసురుకున్నాను

"మరి కాస్సేపటికి ఆయన వచ్చారు. బీరువాలోంచి ఏవో కాయితాలు తీసుకుంటున్నారు 'అవి తర్వాత తీసుకో వచ్చు భోజనానికి ర'మ్మన్నాను ఆయన 'నాకు మళ్ళీ ఆఫీసులో అర్జంటు పనుంది ఈ పూట భోంచెయ్యను లే సుశీ' అన్నారు నేను 'ఎంత పనుంటే మాత్రం అన్నం తినకుండా వెళ్ళడ మేమిటీ? మనాఫీసు కూడా మనం ఆలస్యంగా వెళ్ళితే ముంచుకుపోతుందా?' అన్నాను ఆయన 'మనాఫీసనుకోవడం ఏమిటి? అసలు ఓనర్ మా ఫ్రెండుగదా, నేనుద్యోగిని మాత్రమే' అన్నారు నేను 'మీకూ బిజినెస్‌లో భాగం వున్నప్పుడు నౌకర్ననుకునే ఖర్మేం బట్టే? పనికి మెచ్చి భాగం కూడా యిచ్చిన ఫ్రెండ్, కాస్త ఆలస్యంగా వెళ్ళితే ఏమనుకుంటా రేం? రండి రండి,' అని వారి చేతిలోని కాయితాలు లాక్కుని వంటగదిలోకి పారిపోయాను.

"ఆయన నా వెనకే పరుగున వచ్చి,

'చిలిపనులు చెయ్యకు సుశీ: ఇది లక్ష రూపాయల బిజినెస్ డీల్ క్షణం ఆలస్య మైనా ఛాన్సు పోవచ్చు అందుకే తొందర ఫ్రెండ్ తప్పుపడతాడా లేదా అని కాదు, మనసుకు సమాధానం చెప్పుకోవాలి ముందు' అన్నారు నేను ఆయన భోం చెయ్యకుండా వెళ్ళడాన్ని సహించలేక 'అయితే భోం చెయ్యకుండానే వెళతావా మళ్ళీ రాత్రిదాకా ఉపవాసం చేస్తావుగా?' అని రొక్కించి అడిగాను నిష్ఠురంగానే ధ్వనించాయి ప్రశ్నలు అలాగన్నా వారు భోంచేస్తారని ఆశించాను ఆయన 'మధ్యాహ్నం భోంచేస్తాను - క్యారియర్‌లో పెట్టి పంపమను నాయర్‌ను' అంటూ నా చేతిలోని కాగితాలు లాక్కున్నారు

"అంతలో నా కోపం వచ్చిందను కుంటా 'మీకంత మోజుగా వుంటే ఉపవాసమే వుండండి - నేను ఇంటో వేళకు వంట చేయించలేని దానిలా ఆఫీసుకు క్యారియర్ మాత్రం పంపను' అని చెప్పే శాను అప్పుడే నాయర్ 'మీ కోసం అమ్మగారు కూడా కూచున్నారు సార్ మితో కూచ్చుని తినాలని సరదా పడు తున్నారు సార్' అని చెప్పాడు అంతలో ఆయన నవ్వేశారు 'సరే, ఇద్దరికీ వడ్డించు నాయర్' అని చెప్పి, బాత్ రూంలోకి వెళ్ళారు

"నేను తృప్తిగా ఫీలయ్యాను ప్లేట్లు తీసి టేబుల్ మీద పెట్టాను వారు వచ్చి కూర్చున్నారు నాయర్ తెచ్చిన కూరల గుత్తి అందుకుని నేనే వడ్డిస్తున్నాను - రెండు ప్లేట్లలోనూ, ఆయన 'నువ్వు కూచో సుశీ - నాయర్ వడ్డిస్తాడు లే' అన్నారు నాకు మహాకష్టం వేసింది. నేనంత ముచ్చటపడి వడ్డిస్తుంటే ఆయన ఆలా ఆపడం ఏమిటి చెప్పు? అందుకే 'నాయర్ చేతి వడనే రుచైతే కానివ్వు నేనెంత బ్రతిమాలినా వినకుండా, నాయర్ ఒక్కమాట టనగానే భోజనానికి వచ్చావుగా ఇప్పుడేమయిందో అర్జంట్ బిజినెస్? నాకంటే నాయర్ మాటే ఎక్కువలే నీకూ!' అని కూరల గుత్తి అక్కడ తగలేసి, నేనూ కూర్చీలో కూచ్చుని అన్నం కలుపు కుంటున్నాను

"నేనింత ఇదౌతుంటే ఆయన నవ్వే శారు పైగా 'ఇంత పిచ్చిపిల్ల వేం సుశీ?' ముఖం అట్లా చిట్లించుకుంటే తిన్న అన్నం కూడా వంటపట్టదు నవ్వుతూ తిందూ - నే తొందరగా వెళ్ళాలీ' అన్నారు ఎలాగో ఒకలా తినేశాం ఆయనకంటే ముందే నే చేయి కడుక్కుని, బూట్లు తెచ్చి, వారి కాళ్ళకు తొడగ బోయాను, ఆయన తెల్లబోయి నా వంక చూస్తూ 'ఛాఛ...ఇదేం పని నే తొడుక్కోలేనా?' అని లాక్కున్నారు. నా మనసు చివుక్కుమంది

"ఆయన హడావుడిగా వెళ్ళి కారెక్కి, డ్రయివర్‌ను తొందరగా పోనిమ్మనడం నాకు వినిపిస్తూనే వుంది కాని - అంతలోనే

స్టార్టయిన కారు ఇంజను ఆగిపోయింది. ఆయన లోపలికి పరుగున వచ్చి: 'సాయంకాలం ఉప్మా చేయిస్తావా సుశీ? నీతో వడ్డింపించుకు తినాలనుంది. ఒంటి గంటకి వీలుండదు గాని నాలు గింటికి వస్తా...టా, టా !...బైబై' అని పాఠం వప్పజెప్పినట్లు చెప్పి వెళ్ళి పోయారు. నాకు మరీ విచిత్ర మనిపించింది.

"నా ముచ్చటా మనసూ తెలుసుకోక పోయినా, తమకు కావలసింది ఆజ్ఞాపించి చేయించుకు తినవలసిన వారు–ఇలా బ్రతిమాలుతున్నట్టు మాట్లాడ్డమా ?! అందుకే నేమో అందరూ మరీ మరీ మంచివారని మెచ్చుకునేది......అయినా – ఇలాంటి భర్తతో ఎలా వేగేది చెప్పు రాధికా ? మళ్ళీ అంతటిమంచివారికూడా మనసు కష్టం కలిగించేదాన్నయిపోతున్నానే అని నా మీద నాకే కోపం వచ్చింది. ఏడుపో కోపమో తెలియని అవస్థలో నిన్న మధ్యాహ్నమంతా గడిచింది. ఆ తర్వాత సంగతి నీకు తెలుసుగా సుశీ...ఇంకేం చెప్పను–నా ప్రవర్తనను గురించి ? నిజంగా తప్పంతా నాదే నంటావా ?" అని నిగ్గదీసి అడిగాను.

రాధిక ఫకఫకా పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వింది. పది నిమిషాల దాకా నవ్వుతూనే వుంది నాకు మాత్రం ఆందోళన తీరలేదు "ఎందుకే అంతనవ్వా? నేను పిచ్చిదాన్ననా? వెర్రి కోపంతో వార్నిహడల గొడుతున్న గయ్యాళి భార్య



"కొత్తఫాషన్ అనుకునేవు, నేను వచ్చేటప్పుడు దారిలో సుడిగాలి వచ్చింది"

ననా"? అని గద్దించాను రాధిక నవ్వాపుకుని "మీరు ఇద్దరూ వెర్రివాళ్ళే లే

సుశీ! ఒకరి తప్పూ మరొకరి ఒప్పూ లేదు. కాకపోతే మా అన్నయ్య—నువ్వు శ్రీమతి వనే సంగతి మర్చిపోలేకా, నువ్వాయన భర్త అనే సంగతి మర్చిపోలేకా యిలాటి మనస్తాపాలకు గురవుతున్నారు. బాగా ఆలోచించుకో! ఆయన నీకు చిన్నప్పట్నుంచీ చనువైన మేన బావా, స్నేహితుడూ కూడాను. మనసు విప్పి అంతా చెబితే అర్థం చేసుకోలేని వారు కాదు నువ్వు నీ మనోభావాలు విడమర్చి చెప్పడంలోనే వుంది మీ భవిష్యత్సుఖానికి కీలకం" అంది.

ఇంకేదో చెప్పబోయింది కాని—నా కప్పటికే పూర్తిగా కనువిప్పయింది. "ఇకనేం చెప్పిపోడవకే ఆడబిడ్డా! చాల్లే ఈ ముప్పూటల భాగోతం" అనేశాను రాధిక క్షణం తెల్లబోయింది అంతలోనే మేం కూర్చున్న డ్రాయింగ్ రూంలోని టెలిఫోన్ మోగింది నే వెళ్ళి రిసీవర్ తీసుకున్నాను

అవతల మా వారి గొంతు —

"హల్లో దిసీజ్ మూర్తి స్పీకింగ్... సుశీలగా రున్నారా?"

నేను "ఓ! మీరా?! సుశీలగారు చచ్చిపోయారు, మీ భార్య మాత్రం వుందండీ సార్!'' అన్నాను. రాధిక ఫకఫక నవ్వు తున్నది

ఆయన "ఓ...ఆఁ?...రాధికగారు ఉన్నారా.'' నేను, "రాధికగారా? లేరులెండి. ఇప్పుడే వాళ్ళ తమ్ముడింటికి వెళ్ళిపోయారు. మీరేమాటలైనా నా మొహం మీదే అనొచ్చు గదండీ'' రాధిక మరింత నవ్వి. నన్ను వెనుక నుంచే ముద్దుపెట్టుకుని, "వార్ని ఇంటికి పిలువు — పనయ్యాకే రమ్మనుగాని వెర్రిగా పట్టుబట్టకు" అని నా చెవిలో చెప్పింది

ఆయన "మాట్లాడ వేం సుశీలా?"

నేను "మీరొకసారి ఇంటికి దయచేయగలరా? ఆఫీసు పని అయిం తర్వాతనే సుమండీ!"

ఆయన "ప్రొద్దుట్నుంచీ పదిరోజుల పని చేశాను ఈ రోజంతా మన్నాపెట్టేస్తాను వస్తున్నా రాణీ"

నేను "రాణి దగ్గరకైతే రానేవద్దు భార్యో దాసీదో కావాలంటే రండి"

అంతలోనే సిగ్గు వేసి, టెలిఫోన్ పెట్టేశాను. అప్పటికే రాధిక వెళ్ళిపోయింది

## 15

మూర్తి ఆఫీసునుంచి యింటికి రావడానికి పావుగంట కూడా పట్టివుండదు అప్పటికే సుశీల స్నానం చేసి, బట్టలు మార్చుకుని, పెద్దముత్తయిదులా పావలా కాసంత కుంకుమ బొట్టుకూడా పెట్టుకుని, గేటులో నిలిచి ఎదురు చూస్తున్నది

మూర్తి కారు నాపుచేస్తుండగానే ఆమె ముందుకు వెళ్ళి డోర్ తీసి, చిలిపిగా నవ్వి, "వెల్ కం హోమ్ మైడియర్" అంది మూర్తి ఇగ్నిషన్ కీస్ తీసుకొని

జేబులో వేసుకోబోతున్న వాడల్లా తెల్ల బోయి, తాళం చేతుల గుత్తి నక్కడే వదిలేశాడు. సుశీల "నన్ను క్షమించరూ?!" అంటూనే డ్రయివర్ సీట్‌లో వున్న అతని పాదాలను పట్టుకుని తల వంచుకుంది. మూర్తి తత్తర పడుతూ, నిద్రలోంచి లేచినట్లు కళ్ళు నులుము కున్నాడు. మరుక్షణంలోనే సుశీల గడ్డాన్ని తన తర్జనితో పైకెత్తుతూ, "ఇదేమిటి సుశీ? నీ క్షేమన్నా మతిపోయిందా?" అని అడుగుతూనే, తన కాళ్ళను వెనక్కు జరుపుకో బోయాడు.

సుశీల కళ్ళలో నీళ్ళు [illegible]ు. అతని కళ్ళలోకి దీనంగా చూస్తూ, చేతులు మరింత సాచి అతని పాదాలను తాకుతూ, "పిచ్చినండి, వెర్రినండి–క్షమించితే గాని మీ పాదాలు వదల్ను" అంది. మూర్తి నవ్వి "ప్రతి దానికీ ఇంత పట్టుదలేనా సుశీ? ఇప్పుడు నేనే నిన్ను మన్నించమని అడగాలని వస్తే, నువ్వు నా క్షమాపణ కోరడ మేమిటీ? రాత్రి నే నంత దురుసుగా మాట్లాడి నిన్నెంత నొప్పించానో, ఎంత హీనంగా అలిగిపోయానో తలుచుకుంటే నాకు సిగ్గు వేస్తున్నది. లే, లే–" అని భుజాలు పట్టుకుని వెనక్కు జరుప బోయాడు.

ఆమె మరింత పట్టుదలగా అతని పాదాలను కావిలించుకుంటూ, "మీ రిలా మాట్లాడితే నా కిక ముక్తి వుండదు క్షమాపణకూడా అర్హురాల్ని కాదంటే నే బ్రదకలేను. మిమ్మ్మ మీరు కించపరచు కుంటే అది నాకు సంతోషాన్నిస్తుం దను కోవడం మానివెయ్యండి. నన్ను క్షమించండి" అంటుండగానే, ఆమె కన్నీటి బిందువులు అతని పాదాలమీద పడ్డాయి.

మూర్తి త్రుళ్ళిపడి, ఆమెను బలవంతంగా వెనక్కు జరుపుతూ "సరే; సరే సుశీ! నిన్ను క్షమించాను లే...పద లోపలికి...ఈ రోడ్డుమీద, ఇట్లా—'' అంటున్నాడు. సుశీల తల విదిలించుకుని కన్నీరు జలజల పూలలా రాల్చేసింది. అంతలోనే నవ్వు తెచ్చుకుంటూ, ''ఏమండీ – బజార్లో నలుగురూ చూచి నవ్వుతా రనా? లేక; భార్యకు చాద స్తపు పాతివ్రత్యం నేర్పిన అహంకార పురుషుడని మిమ్మల్ని ఆడిపోసుకుంటా రనా? ఈ పైమెరుగుల లోకపు మెప్పుల కోసం భార్యగా నాకుగల స్థానాన్ని, హక్కును కాదంటారా?" అని అడిగింది.

అతడు నిర్విణ్ణుడై చూస్తూనే ఆమెను పొదివి పట్టుకున్నాడు. ఆమెనిజంగా తన కర్థంకాని మరో స్త్రీలా వుంది. కాని ఆమె మాటలతీరు తానెన్నడో కలలో కాంచినట్టే వుంది. భార్యను నడిపించుకుంటూ, ఇంట్లోకివస్తూ; "ఈ హఠాత్పరిణామానికి కారణం ఏమిటని" అడిగాడు. "సుశీ ఎన్నడూలేంది ఈ పాదాభివందనాలేమిటీ, ఈ వాలక మేమిటీ, ఈ మాటలేమిటీ?" అని అడిగాడు సుశీల భారమంతా అతనిమీదే వేసినట్లు, ఎద నాను

క్షుని నడుస్తూ : ''మామూలు సుశీలనైతే 'నీ కెందుకూ, నా యిష్టం' అనే దాన్ని కదూ? అట్లా అని నన్ను నేవంచించుకో లేనిక మూర్తీ. ఆ సుశీల చచ్చిపోయిం దన్నది అందుకే. నేనిప్పుడు వట్టి భార్యను మాత్రమే. అందుకనే -'నా హక్కును చెయిసాచి అడుగుతున్నాను'' అంది.

మూర్తి ఆమెను డ్రాయింగ్ రూం లోని ఒక సోఫాలో భద్రంగా కూర్చో బెట్టబోతూ : ''విచిత్రంగా వున్నాయ్ నీ మాటలు ! నువ్వేం అడిగితే కాదన్నాను సుశీ - ఇవ్వాళిలా యాచించవలసి వచ్చి నట్టు మాట్లాడుతున్నావు?'' అన్నాడు. సుశీల అతని పట్టును వదిలించుకుని, అతనినే సోఫాలో కూర్చోబెట్టి, తాను పాదాలముందు కూర్చోబోయింది. మూర్తి వారించబోతే : "అదుగో మళ్ళీ నా స్థానానికి నన్ను దూరం చేస్తున్నారు-" అని, అతని పాదాల ప్రక్క చదికిలబడి అతని ఒళ్లోకి చేరగిలబడింది. అతడు గోముగా ఆమె చెక్కిళ్ళను సవరించ సాగాడు.

సుశీల క్షణంలో మధురాతి మధుర మైన అనుభూతికిలోనై, అంతలోనే తెప్పరిల్లి లేచింది. అతని కళ్ళలోకి సూటిగాచూస్తూ "నాక్కావలసిందీ, నా కిష్టమయిందీ అనుకుంటూ అనేకానేక సందర్భాల్లో మీక్కావలసినవీ, మీ యిష్టాలూ త్యాగం చేసుకున్నారు ఈ రోజున పునర్జన్మ ఎత్తిన మీ భార్య చెబు తున్న మాటలు మరిచిపోకండి. భార్య క్కావలసింది త్యాగంచేసే మానవాతీత పురుషుడు కాదు-భర్త; లోకసహజమైన మమకార వికారాలన్నీవున్న భర్త!!" అంది.

ఉపన్యాసంలావున్న ఆమె మాటల్ని మూర్తి అర్థం చేసుకోజూస్తున్నాడు. అతని మనసు కేదో అర్థమౌతున్నట్లే వుంది. ''ఇంతకీ నువ్వు చెప్పేదేమిటో సూటిగా చెప్పగూడదా సుశీ!" అని అర్థించాడు. సుశీల నవ్వి "అట్లా అర్థించి నట్లు అడగవలసింది నేను. మగవారి కాధోరణి తప్పదు. మీ రాజ్ఞాపించవలసిన వారు — నేను శిరసావహించ వలసిన దాన్ని. నేను మేనత్త కూతుర్నని వార సత్వం మాటలు మరిచిపోండి. సుశీల ఘూరినీకాదు, మా నాన్న మెచ్చుకునే ప్రాణినీకాదు; ఒట్టి సుశీలనే నని, మీ భార్యగాతప్ప నాకు మరో వ్యక్తిత్వం అవసరంలేదనీ గుర్తించితే - అదే నాకు మీ రివ్వవలసిన భిక్ష" అంటూనే మళ్ళీ పాదాలు సవరించింది.

మూర్తి ఈసారి పాదాలు వెనక్కు లాక్కోలేక పోయాడు. మనసు అలా చెయ్యమన్నా, హృదయం ఆ పని కొప్పుకోలేదు. అతడు మనసారా నవ్వుతూ ''నువ్వు చెప్పేమాటలు నబబు గానే వున్నాయ్ సుశీ' కాని-ఈ రెండేళ్ల నుంచీ ఎన్నడైనా నువ్విట్లా మారితేగాని బాగుండదనే భావం కనబరచలేదుగదా

నేను. మన-జీవితాల్లో ఏదో లోటు ప్రవేశించిందనే భావం నా కెన్నడూ కలగ లేదే!!" అన్నాడు.

సుశీల ముఖం పైకెత్తి భర్త కళ్ళలోకి చూస్తూ "నేను మీకంటే తెలివిగల దాన్ననా నన్ను అడుగుతున్నారు. ఇదే అసలు చిక్కు మూర్తీ. నేను శ్రీమతి ననే భావంతోనే ఆనాడు పెళ్ళి కళ్యంతరాలు చెప్పారు. పెళ్ళాడినా శ్రీమతిని తృప్తిపరచాలనే అనుక్షణం తాపత్రయపడ్డారు. నన్ను గౌరవించి, మీరు నాకంటే తక్కువ స్థాయికి చెందినవారైనట్లు ప్రవర్తిస్తే సంసారం సుఖ శాంతి నిలయం అవుతుం దనుకున్నారు. కాని — నేను శ్రీమతిగానే వుండలేక పోయాను మూర్తీ.

''అరునెల్ల సావాసంతో అటువారిటు మారతారంటారు. నా మనసలాగే మారి పోయింది. మీవంటి ఉత్తమ పురుషునికి తగ్గ భార్యగా ఈ శ్రీమతి తనను తా మలుచుకో జూచింది. మనసు మారినా మాటలు మారలేదు. తలిదండ్రులు నేర్పిన చిలక పలుకులూ, చిరు దురహంకార ప్రవర్తనా ఓపట్టాన మారవు గావల్ను. మనసులోని మమకారాన్ని — మాటల వికారాలు మింగివేస్తూ — నా జీవితాన్నే రాహుగ్రస్తం చేశాయి. రెండేళ్ళు సంసారం చేసినా నేను మీలాంటి దాన్ని కాలేననే అనుకుంటున్నారా? విజం చెప్పండి — నేను మీ భార్యగా, సర్వ విధాలా అర్ధాంగిగా మారా లనుకోవడం తప్పా?" అని ఆక్రోశంతో అడిగింది.

ఆమె ఆర్తి [illegible]మూర్తి కిప్పుడు బాగా అర్థమయింది. "[illegible]న్న తప్పుబట్టడం ఇక నాచేతకాదు సుశీ! నేను నీకంటె అజ్ఞానంలో వుండబట్టే - ఇప్పటి వరకూ నీ అంతర్య సౌందర్యాన్ని, సౌశీల్యాన్ని గుర్తించలేక పోయాను. శ్రీమతివే నను కున్నానుగాని సుశీల అనే పేరున్నదానివే అనుకున్నాగాని, - సుగుణశీలా లన్నీగల భార్యవని గుర్తిచలేక పోయాను. నేనే ఓ విశాల హృదయుడనై నిన్నుద్ధరిస్తున్నట్టు భావించిన పురుషుణ్ణి - వట్టి పురుషుణ్ణి. ఈ తప్పంతా అసలునాదే! అందుకు క్షమించ వలసిందని అడిగి నీకు తగ్గ భర్తగా మెలగడమే నా కర్తవ్యం - లే. లే...ఆకలవుతూంది'' అన్నాడు.

సుశీల వేయిమడుంగుల ఉత్సాహంతో లేచి, మళ్ళీ చివాలునవంగి అతనికి పాదాభివందనంచేసి కళ్ళ కద్దుకుంది. తటాలున అతని ఒళ్ళోకూచ్చుని: "షట్కర్మయుక్తా, కులధర్మపత్నీ అనే శ్లోకం మరిచిపోరుగదూ? పనుల్లో దాసీదానిగాతప్ప - తతిమ్మా అన్నిటా యధా ధర్మంగానే చూచారింతకు ముందు. ఇక ముందీదాసీతనం కూడా నా ముచ్చటకేనని వప్పుకుంటారుగదూ?'' అని అడుగుతూ గట్టిగా కంఠాన్ని కావులించుకుంది.

మూర్తి ఆమెనుదురుమీద వెచ్చగా ముద్దుపెట్టుకుని "అమ్మదొంగా! అదా నీ ముచ్చటంతా ?! నేనింతవరకూ అర్థమే చేసుకోలేదు ఇల్లాలు పనిచేస్తానంటే - ఈ యజమాని వద్దనడులే ఇంక, మరి - మధ్య మధ్య కీచులాటలు కూడా వుంటేనే గాని జీవితం వడ్డించిన విస్తరి కాదంటావా ఏమిటీ?!" అన్నాడు.

సుశీల మరింతగా అతనిలో ఐక్యం కాజూస్తూంది "అది కాదండీ! 'మీరు' అనడంకూడా చేతకానట్లు 'నిన్ను' అని సంబోధించే ఈనోటి మీద ఎప్పుడన్నా ఒక్కటి వడ్డిస్తేగాని తిక్క కుదురుతుందా చెప్పండి భర్తను - మీ లాంటి భర్తను కూడా ఈ నోరు 'నువ్వు' అంటుందే, అట్లాంటివే - తెలివితక్కువ గానో, మీ మాట లర్థంచేసుకోని అహం తోనో నేను మాట్లాడినప్పుడు మీ రేమీ అనకుండా వూరుకుంటే - నాకు ద్రోహం చేసినట్లే గదా!" అంది

మూర్తి ఆమెను మరింత బిగ్గ కౌగలించుకుని "మరేం చెయ్యాలి?" అన్నాడు సుశీల "అబ్బ! అది కూడ నేనే చెబితే ఏం బావుంటుందండీ రిహార్సల్ వేసుకున్న నాటకం కాదుగ జీవితం? నాక్కావల్సింది పులిబావకాః పిల్లిబావకాదు" అంది మూర్తి పకపక నవ్వి "మధ్య మధ్య రొకటి పచ్చడి వడ్డింపులు వుంటేగాని ఈ భార్య, ఈ భర్తను భరించలేదన్న మాటా !!" అన్నాడు

సుశీల "మానవాతీతుడైన భర్త - తనను తాను కించపరచుకుంటూ, భార్యనే మిన్నగాచూడ్డం ఆడదానికి భాగ్యం కాదండీ - స్త్రీకి అంతకుమించిన శిక్ష మరొకటుండదు నాక్కావలసింది పేదమేనమామ కొడుకనే సంగతి మరువలేని మనిషికాదు స్నేహిత మాత్రుడూగాదు - భర్త, సాదాభర్త'' మమకారంతోపాటు వికారాలు కూడా వున్న భర్త!" అని నొక్కి నొక్కి చెప్పింది

మూర్తి "తథాస్తు!" అన్నాడు






3. "బొమ్మలకే ప్రాణంవస్తే.."




అద్దమే చూచితినా అందులోను నీవేనే
పద్దెమే రాసితినా ప్రతిపదమూ నీవేనే

ఎందుకే అందముగా నన్ను చూచి నవ్వేవూ?
అంతలో కోపముగా పిడిగులనే రువ్వేవూ?

నవ్వితే నా మదిలో పువ్వులెన్నొ పూసేనే
కోపమే చూపితివా గుండెపగిలి పోయేనే

హంసలా నడచితివా ఆకలంత తీరేనే
నీటుగా నిలిచితివా నోటనీరు పూరేనే

మల్లెలే చల్లెనులే చల్లని నీ నయనాలు
ముల్లెలో దాచితినే నీ చూపుల రతనాలు

నీడలా నీవెనకే ఇన్నినాళ్లు నిలిచానే
మేడలా నామదినే నీకోసం మలిచానే





"పెళ్ళివారింటో నుంచి పలహారాలు తేవటానికి నీకు సిగ్గు వెయ్యేలేదూ?"
"ఎందుకూ సిగ్గు! నీ పేరు చెప్పే తెచ్చాను."

నాకు చాలా ఆశ్చర్యం వేసింది

చలపతిలో అంత ఆశ్చర్య పడవలసిన దేమయినా ఉందని కాని, చూసి ఆశ్చర్యంలో మునిగిపోవలసినంత విచిత్ర వ్యక్తి అని కాని కాదు నా ఉద్దేశ్యం

— నెహ్రూ లాంటి వాడిని మా ఊళ్ళో మామూలుగా తటస్థపడితే ఆశ్చర్యపోవడం సహజం. నేను కలలో నయినా అనుకోలేదు ఆ ఊళ్ళో చలపతిని చూస్తానని

"నేనేరా చలపతిని - ఏమిటి అంతగా ఆశ్చర్యపోతున్నావు?" అన్నాడు నన్ను చూసి దగ్గరగా వచ్చిన చలపతి

"సహారా ఎడారిలో మంచి

సింగరాజు రామచంద్ర మూర్తి

నీళ్ళు కనబడితే మనకంటి నే మనం నమ్మ లేము; ఒక్కొక్క సారి నిజాన్ని నిజంగా చూపించినా నమ్మడం చాలా కష్టం...సరే, ఈ ఊళ్ళో దిగబడ్డావు?"

"దిగబడిన వాడివి నువ్వని నీ వాలకం, చేతిలోని సంచి చెపుతున్నాయి. నే నీ ఊరికి పాతకాపు నయానోయ్— అ... నే నీ వంటి అతిథి దేముళ్ళకి ఆతిథ్య మిచ్చే దురదృష్టం పడుతుంటుంది అప్పుడప్పుడూ. పద, ముందు కాఫీతో ప్రారంభిద్దాం మన గృహస్థ ధర్మం!"

"గృహస్తువుకూడా అయ్యావా?"

"అహా, మీ అందరి దయవలన!"

"ఖర్మ...."

ఇద్దరం నవ్వుకుంటూ హోటల్లోకి దారి తీశాం.

"ఎన్నాళ్ళయిం దేం ?"

"ఏమిటి ?"

"అదే—మహారాజు వయి!"

నవ్వాడు చలపతి. "అయిందిలే దగ్గర దగ్గర రెండు సంవత్సరాలు. మనం విడిపోయి మూడేళ్ళు కాలా ?"

చలపతి నాతోపాటు విశాఖలో చదువుకున్న తరువాత మా ఇద్దరి దార్లూ వేరయాయి. ఏదో ఉమ్మడి స్నేహితుల ద్వారా కొన్నాళ్ళపాటు వాడి ఉనికి తెలిసింది. కాని తరువా త్తరువాత అటువంటి అవకాశమూ లేకపోయింది. అయినా చదువుకునే రోజుల్లో అనుకుంటూ ఉంటాము — జీవితాంతం అలాగే ఉంటామని. ఆ ఉద్దేశ్యంతోనే విడిపోయేప్పుడు అడ్రసులు కూడా తీసుకుంటాము. రెండు మూడు నెలలపాటు ఉత్తరాలు హోరాహోరీగా సాగి మెల్లగా "ఫేడౌటు" అవుతాయి. ఆ తరువాత సమావేశ స్థలాలు సర్వసాధారణంగా రైల్వే ప్లాటుఫారాలు, సినిమాహాల్సు.

"ఏమిటిరా ఆలోచిస్తున్నావు ? — పీడెందుకు తగిలాడా అనా ?" నవ్వుతూ అడిగాడు చలపతి.

"ఛలేవాడివే, అలా ఏడవ్వలసిన వాడివి నువ్వు. నేనీ ఊళ్ళో మూడు రోజులపాటు అఘోరిద్దామని వచ్చాను."

"చంపావు పో! అయినా తప్పుతుందా — మూడేళ్ళ స్నేహం తరువాత మూడేళ్ళపాటు విడిపోయిన స్నేహితుడు కనబడి మూడు రోజులే ఉంటానని హామీ ఇచ్చినా ఇంటికి తీసుకుపోకపోతే లోకం ఏమంటుంది?"

నవ్వులాటకి నేనలా అన్నప్పటికీ నాకు మాత్రం వాడింటికి వెళ్ళడం ఇష్టంలేదు. అసలు వాడింటికే కాదు - మహామహా మా మావయ్యల ఇళ్ళకే వెళ్ళక వాళ్ళచేత గర్వం, అహంకారం అన్న బిరుదులు తగిలించుకున్న వాడిని, అటువంటిది....

"లెదురా . చలపతి, నెనొచ్చింది పూర్తిగా ఆఫీసు పనిమీద! వాళ్ళు నాకు ఈ మూడు రోజులకి మస్తుగా ఇస్తారు కాబట్టి హోటల్లో దిగుతాను. మన స్వంత డబ్బయివుంటే తప్పకుండా నీ నెత్తినే ఎక్కేవాడిని – ఆ ఆముదమేదో నీకే కానివ్వమని" అన్నాను సీరియస్‌గా ఎలాగయినా వాడిని ఒప్పించాలన్న తాపత్రయంతో

"ఏడిశావులేవోయ్ – ఇవ్వాళ నువు రావడం మానేసినా రేపు నేను మీ ఊరు వస్తే మాత్రం వారంపాటు మీ ఇంట్లోనే తిష్టవేయక మానను. కాబట్టి నువ్వు ముందు జాగ్రత్త పడడం అవసరం మారుమాట చెప్పక ఇంటికి పదు. మా ఆవిడతో నిన్ను గురించి చాలాసార్లు చెప్పాను – కథలు కూడా వెలగబెడుతున్నావుగా ఈ మధ్య, పద"

బుద్ధిమంతుడయిన కుర్రాడిలా వాడి వెంట నడిచాను.

దారిలో గడిచిన మూడు సంవత్సరాలలో, జరిగిన విషయాలు సంక్షిప్తంగా చెప్పాడు –

"నా పెళ్ళికి స్నేహితులెవర్నీ పిలవలేదు ఇష్టంలేక కాదు – టైము లేక. అంత హటాత్తుగా జరిగిపోయిందన్న మాట. ఒక్క వారం రోజుల ముందుదాకా నాకే తెలియదనుకో. మా ఆవిడ చాలా బాగుంటుంది, పాపం నాకు తగిన మనిషి కాదు. ఐ మీన్ నేనా అమ్మాయికి తగిన వాడిని కాదు మరి. నన్ను చేసుకుందుకు ఎలా ఒప్పుకుందో నాకిప్పటికీ వింతగానే ఉంటుంది చదువుకుంది ఇంటర్ దాకా హిందీలో విశారద పాసయింది ఏమయినా కానీ అదృష్టవంతుడ్ని నేను – ఆ అమ్మాయి కాదు. చూస్తావుగా! ఇంతవరకు సంతానం అనేది లేదు కాకపోతే పెళ్ళయిన కొత్తలో ఒకడు పుట్టిపోయాడు"

మాట్లాడకుండా 'ఊ' కొడుతూ వాడు చెప్పేది వింటూ నడుస్తున్నాను. అంతలోనే చలపతి మాట్లాడడం ఆపి –

"ఇదే మా ఇల్లు" అంటూ లోపలికి దారితీశాడు,

ఒక పెద్ద డాబాలో పెద్ద పోర్షను వాళ్ళది కొత్తగా కట్టిన ఇల్లు, చుట్టూ కాంపౌండు గోడ, చక్కటి వరండా– ఇల్లు చూడటానికి అందంగా ఉంది. లోపల హాల్లో ఒక చిన్న టేబుల్ వేసి చుట్టూ నాలుగు వేపుల కుర్చీలు అందంగా అమర్చబడి ఉన్నాయి – టేబుల్ మీద ఒక ఫ్లవర్ వాజు, చక్కని ఏష్‌ట్రే. తెల్లటి గోడల మీద రెండే రెండు బొమ్మలు – శివ పార్వతులవి, రాధా కృష్ణులవి ఉన్నాయి.

గోడలకి అంగుళం వెలితి లేకుండా ఫొటోలు తగిలించే ఇళ్ళను చూస్తే

నాకు కంపరం మెత్తుతుంది. వాళ్ళ సౌందర్యాలని ప్రత్యక్షంగా చూసి బాధ పడటమే కాకుండా వాళ్ళ ఇంట్లో ఉన్నంత సేపు వాళ్ళే మన కంటికి కనబడాలని కాబోలు అలా తగిలిస్తారు - పెళ్ళినాటివి, నోములు నోచుకున్నప్పటివి వగైరా! అదీ ఒకందుకు మంచిదే - వీళ్ళ బాధ పడలేక అతిథి వెంటనే ఉడాయిస్తాడు. ఇల్లు ప్రశాంతంగా కడిగిన ముత్యంలా ఉంటే వెళ్ళమనేదాకా వెళ్ళను.

అందుకే నాకు చలపతి ఇంట్లో శాశ్వతంగా ఉండిపోదామనిపించింది. నా మనస్సుకి నచ్చేట్టు ఉంది ఇల్లు.

చలపతి ఇంట్లోంచి రావటంతో నా ఆలోచనల్లోంచి బయట పడ్డాను. వాడి వెనకనే కర్టెన్ తొలగించుకుని ఒకమ్మాయి బయటికి వచ్చింది.

"మా ఆవిడ, పేరు ఇందిర - వీడు నేను రోజూ చెబుతుంటానే - విశ్వేశ్వ రావు. కథలు గిలుకుతుంటాడు. ఒరేయ్, అన్నట్లు మా ఆవిడ నీకు పెద్ద 'ఫాను' " పెళ్ళున నవ్వాడు.

"నమస్కారమండి" అంది ఇందిర.

యాంత్రికంగా ప్రతి నమస్కారం చేశాను ఆలోచిస్తూనే. సాదా అయిన వాయిల్ చీర, దానికి సరిగా సరిపడే బ్లవుజు, చేతులకి బంగారపు గాజులు - చాలా సింపుల్ గా అందంగా ఉంది. ఇంటి అలంకరణచూసి ఆవిడ్ని ఊహించుకుంటే ప్రత్యక్షంలో మనకి ఆశాభంగం కలగదు.

కాని నాకు అంతుపట్టని ప్రశ్న ఒకటి మిట్టుకు నన్ను వేధిస్తూనే ఉంది - ఆవిడని ఎక్కడ చూశానూ అన్నది. చూశా నన్నదిమాత్రం వాస్తవం!

ఆవిడ మాత్రం మామూలుగానే - "మీ కథలు చదువుతుంటానండి, చాలా బాగుంటాయి" అంది నవ్వుతూ.

ఎవరికయినా తన్ని గురించి ఒకరు అంటున్నప్పుడు ఏమి చేయాలన్నది పెద్ద సమస్యే - స్టేజిమీద డైలాగులు లేని నటుడిలా ఉంటుంది. "ఆఁ ఏదో లెండి, ఉబుసుపోకకి రాసేవి" అన్నాను.

"చదవటంకూడా కాలక్షేపానికే కదండీ"

ముగ్గురం నవ్వాం.

"అది సరేగాని విశ్వం, నువ్వు రాయడంలోని ఉద్దేశ్యంలో కాన్ని మరమ్మతు చేద్దామనా లేక కేవలం సరదాకా?" అడిగాడు చలపతి.

"మనం రాసినంత మాత్రాన లోక రీతి మారిపోతే ఈ పాటికి స్వర్గంలా తయారయేది-మాకూ కథా వస్తువులు దొరక్క చచ్చేవాళ్ళం" అని నవ్వి "ఒక ప్రఖ్యాత రచయిత అన్నట్టు 'పత్రికల వాళ్ళు ఇదివరకు ఋణం ఇచ్చేవాళ్ళు, ఇప్పుడు పణం కూడా ఇస్తున్నారు' కాని నేను రాయడం



"చూడండి, అది ఏబండి ?"
"రైలుబండి"

అందుకోసం కాదనుకో - కేవలం మన భావాలు నలుగురితోనూ పంచుకోవాలని. అంతే" అన్నాను.

జాగ్రత్తగా వింటున్నదల్లా ఇందిర మళ్ళీ నేను తనవైపుకి చూపు తిప్పటంతో "ఒక్క అయిదు నిమిషాల్లో కాఫీ పట్టుకొస్తాను" అని లోపలికివెళ్ళి పోయింది

"ఏం భాయి, ఎలా ఉంది ఇల్లు?"

"గృహమేకదా స్వర్గసీమా అని పాడుకోవచ్చు"

"అంతమాట అనకురోయ్! అందులో హీరో మధ్యలో పెడదారిని పడ్డాడు ఇందులో నేను పెడదారినుంచి మంచి మార్గంలోపడిన వాడిని - మళ్ళీ మూర దలుచుకోలేదు. అన్నట్టు నీ విషయం చెప్పావుకాదు" అంటూనే వాకిట్లోకి వెళ్ళాడు

నవ్వుకున్నాను

మళ్ళీ అంతలో ఇందిర గుర్తు కొచ్చింది. చాలా పరిచయం లేక పోయినా మొత్తంమీద పరిచయం ఉంది నాకా అమ్మాయితో. మాట్లాడు తుంటే కూడా అలాగే అనిపిస్తోంది. కాని అయితే సమాధానం మాత్రం రావడంలేదు. కాలేజీలోనా. కాదు. పెళ్ళిచూపులలోనా? అంత చక్కని

అమ్మాయినిచూస్తే కాదనేవాడినా?. మరి ఎక్కడ ఏవిధంగా ?

"కాఫీ తీసుకోండి! . ఆయనేరి?"

"నీ విషయాలు చెప్పమని అడిగి వినిపించుకునే ఓపికలేక బయటికి పరుగెత్తాడు. కూర్చోండి!"

నవ్వింది ఇందిర–"ఆయన ఎప్పుడూ అంతే పరధ్యానంగా ఉంటారు. అడిగిన విషయం జ్ఞాపకం ఉంచుకోరు. చెప్పిన విషయం సరేసరి! అయినా మీకు తెలియని దేముంది – మూడేళ్ళు ఆయనతో కాపరం చేశారుగా!"

ఇద్దరం నవ్వేశాం. నాకిదే అదునని పించి –

"ఒక్క మాట అడుగుతాను, మరేమీ అనుకోరుకదా!" అన్నాను

"అడగండి"

"మనిద్దరం ఇదివరకెప్పుడయినా కలుసుకున్నామా? అహ – మీకూ అలా అనిపిస్తోందా అని"

ఆమె కాసేపు మౌనంగా ఉండి చివరికి "లేదు" అంది

"అయితే నేనే పొరపడ్డానన్నమాట! కానీ ఎంత సరిపెట్టుకుందామన్నా మనస్సు సమాధాన పడటంలేదు మీ మాటా, నవ్వు, మీరూకూడా ఎక్కడో విన్నట్టు, చూసినట్లుగా అనిపిస్తోంది."

ఆమె తలవంచుకుని వింటోంది అంతలో హడావుడిగా చలపతి లోపలికి వస్తూ –

"ఇందిరా, మనవాడికి కాస్త కాఫీ ఇవ్వకపోయావూ? అరే, అప్పుడే తాగుతున్నాడే! మరి నాకేదీ? అహా, నాకూ తెచ్చావన్నమాట" అంటూ కాఫీకప్పు అందుకున్నాడు.

ఇందిర నావంక చూసి నవ్వింది నేనూ నవ్వేశాను

భోజనాల వేళ దాకా కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాము మా స్నేహితులు ఎవరెక్కడ ఏ పని చేస్తున్నదీ, విశాఖపట్టణంలోని బ్రహ్మచారి జీవితం – మొదలయిన వన్నీ నెమరువేసుకున్నాము అక్కడే ఉండిపోయి 'రీసెర్చి' చేస్తున్న వాళ్ళని తలుచుకుని ఈర్ష్య పడ్డాము ఇందిర భోజనాలకి లేవచ్చని అనడంతో నిజ జీవితంలోపడి లేచాము!

ఆ పగలంతా మామూలుగానే గడిచి పోయింది చలపతికి కూడా శలవులవటాన ఇంట్లోనే ఉండి పోయాడు. కాసేపు కారమ్సు, మరి కాసేపు నిద్రల మీదుగా సాయంత్ర మయి పోయింది తరువాత సినిమా కన్నాడు చలపతి ఇందిర మొదట రానంది, కాని మా బలవంతాన రాక తప్పలేదు.

ఆమె మధ్యన కూర్చుంటే మే మిద్దరం చెరోవైపు కూర్చున్నాము.

చలపతికి వసుధః సినిమాలన్నా, నవలలన్నా పడేది కాదు అసలు

వచ్చేవాడే కాదు కాని పొరబాటున వస్తేమాత్రం ఆద్యంతం ఒక్క ముక్క విడవకుండా చూసేవాడు సమాధిలో పడిన ఋషిపుంగవుడి లాగా అందులో లీనమయిపోయి ఇచ్చిన రూపాయిన్నర గిట్టించుకుని మరీ బయటికి వచ్చేవాడు

ఇప్పటికి కూడా వాడేమీ మారలేదు

అయితే ఇందిర నా వైపుకి తిరిగి సినిమాని గురించి, కథలని గురించి నాతో మాట్లాడ సాగింది ఆమెకి వాటి మీదనున్న అభిరుచికి నా కాశ్చర్యం వేసింది వీళ్ళిద్దరి మనస్తత్వాలు, అభిరుచులు ఇంత భిన్నంగా ఉండి వీళ్ళు ఒకే ఇంట్లో ఎలా గడుపుతున్నారా అనిపించింది. అంతలోనే నా కింకొక విషయం కూడా స్ఫురించింది

వాళ్ళు చేస్తున్న సంసారం కూడా ఒక నటనలాగానే చేస్తున్నారని! అంటే బయటి వాళ్ళు ఏమయినా అనుకునిపోతారన్నట్టుగా ఒకళ్ళతో ఒకళ్ళు మాట్లాడు కుంటున్నారని! అలా ఎందు కనిపించిందో నాకే తెలియదు అసలు మామూలుగా రోజూ వీళ్ళిద్దరూ మౌనంగానే ఉంటారేమో!

"ఇప్పటి కయినా మీకు నన్నెక్కడయినా చూసిన ట్లనిపిస్తోందా?" అనడిగాను మళ్ళీ

ఆమె నవ్వి "ఇందాకటి ప్రశ్నకి ఇందాకటి సమాధానమే! .. మీకు ఏమయినా గుర్తు కొచ్చిందా?" అనడిగింది.

ఆ అడగడంలోని ఉత్కంఠ గమనించితే ఆమెకి తెలిసికూడా దాస్తోందేమో నన్న అనుమానం కలిగింది.

"లేదుకాని వెళ్ళేలోపల కనుక్కుని మీకు చెబుతాను" అన్నాను ధీమాగా.

ఆమె సినిమా వైపుకి దృష్టి మరల్చుతూ "అయితే మీరు త్వరగా వెళ్ళిపోండి" అంది నవ్వుతూ.

ఆశ్చర్యంతో ఆమెవంక చూశాను.

పిక్చరుని తిట్టుకుంటూ ఇంటికి చేరుకున్నాము అన్నాల దగ్గర ఇద్దరూ కలిసి ఒకరిని మించి ఒకరు నన్ను బలవంతం చేసి తినిపించసాగారు. అసలు సినిమాకి వెడితే భోజనం లేకుండా పడుకోవడం నా కలవాటు. అటువంటిది వాళ్ళు విందు భోజనం లాగా తినిపించుతుంటే కడుపు నిండిపోయింది. చివరికి ఇవన్నీ చాలవన్నట్లుగా ఇందిర పెరుగు పట్టుకొచ్చి ఒడ్డించబోయింది వద్దంటే వినదని "వేస్తే పారేయడం ఖాయం – కావాలంటే వేసి చూడండి" అన్నాను

ఆడవాళ్ళ దగ్గిర ఇదే నేనుపయోగించే ఆఖరు అస్త్రం!

"తినకపోతే నా మీద ఒట్టే!" అంటూ గబుక్కున వేసేసింది.

సినిమాల్లో పోయిన మతి రావాలంటే మళ్ళీ తలమీద ఒక దెబ్బ తినిపించడమో లేక కరెంటు షాకు ఇప్పించడమో చేస్తారు. ఆ దెబ్బతో హీరో మామూలుగా తయారవుతాడు.

వచ్చినప్పటినుంచి తేలని ప్రశ్న ఇందిర అన్న ఒక్క మాటతో ఆమెని నాకు పట్టి ఇచ్చింది. ఆమెను ఎక్కడ చూసినదీ ఘణ్ణంగా గుర్తుకి వచ్చేసింది. అందుకే ఆశ్చర్యం కూడా వేసింది — మరి మాధవరావు ఏమయాడా అని! ఆ మెవంకే చూశాను —

నా చూపులోని అర్థం గ్రహించినట్లుంది, తల వంచుకుని లోపలికి వెళ్ళిపోయింది ఇందిర.

ఇందాకటినుంచి నన్ను వేధించింది ఒక్క ప్రశ్నే అయితే ఇప్పుడు తలనిండా అనుమానాలే బయలుదేరాయి. ఆమె ఆ పరిస్థితిలోంచి బయటకెలా వచ్చింది? అతను ఏమయ్యాడు? చలపతికి ఈ విషయం తెలిసే చేసుకున్నాడా — ఇప్పుడు తెలిస్తే వీళ్ళ ఇంటి పరిస్థితి ఎలా ఉంటుంది?

ఆలోచనలతో సతమతమవుతున్న నా దగ్గరకు నిద్ర రానన్నది. లేచి సిగరెట్ వెలిగించుకుని వరండా దిగి బయట ఉన్న సిమెంట్ బల్లమీద కూర్చున్నాను.

చంద్రుడు మబ్బుల చాటునుండి తన కాంతిని బయటకు ప్రకటించేందుకు వ్యర్థ ప్రయత్నం చేస్తున్నాడు. అయితే మునిసిపాలిటి వారికి మాత్రం అది వెన్నెలరాత్రి కావడాన దీపాలు ఆర్పేసి రోడ్లని చీకటిలో ముంచారు.

ఇంతలో ఇంట్లోంచి తలుపు తీసుకుని ఇందిర బయటికి వచ్చింది.

"హలో, మిమ్మల్ని ఎక్కడ చూసినది గుర్తుకొచ్చేసింది" అన్నాను ఆమె వంక నిశితంగా చూసేందుకు ప్రయత్నిస్తూ.

"గుర్తుకొచ్చిందని గ్రహించబట్టే ఇప్పుడు నేను బయటికొచ్చింది'' అంది మెల్లగా.

నాకు జాలేసింది!

"నో, నో మీరు నన్ను అపార్థం చేసుకోవద్దు. గుర్తుకొచ్చారన్న ఆనందమేగాని అది బెదరింపు కాదు. ఈ రహస్యం — రహస్యమే అయితే — నన్ను దాటి బయటికి పోదు.'' అని కాసేపాగి "కూర్చోండి" అన్నాను.

కూర్చోకుండా నేల మీద కూర్చుంది. నేను కూడా బల్లదిగి ఆమెకి ఎడంగా గడ్డిమీద కూర్చున్నాను.

"ఇప్పుడు చెప్పండి అసలు కథ, మిమ్మల్ని మాధవరావుతో మద్రాసులో నేను చూడటం ఎలా సందర్భ



"అరేయ్! ఈ లేడిపిల్ల ఈ మధ్య నా వైపు చూడటమే మానుకుందే!!"
"బాగు బాగు! అయితే ఇక నా వైపు చూడటం తథ్యం!!"

పడింది ?.... స్నేహితుడుగా అడుగుతున్నాను."

ఆమె కాసేపు మౌనంగా ఉండి చివరికి "రహస్యంగా ఉంచుతానన్నారు మీరు. కాకపోయినా ఇక నేనూ దాచి ప్రయోజనం లేదు—ఎవరితోనయినా చెప్పుకునే బదులు మీకే చెబుతాను....

"మాది చాలా బీద కుటుంబం. నాన్నగారు గుమాస్తాగా సంపాదించే దాంతో మా కుటుంబం గడవటమే అస్తవ్యస్తంగా ఉండేది. దానికితోడు అమ్మ జబ్బుమనిషి. ఎప్పుడూ డాక్టర్ల అవసరంకోసే శరీరం ఆమెది. — అని చెప్పి డాక్టర్లకి చూపించే వారనడం ఆవిడకి అపచారమే చేసినట్లవుతుంది. ఉన్నదాంట్లోనే శక్తివంచన లేకుండా నాటువైద్యుల మందు నాడుతుండే వారునాన్నగారు. నాకు తలుచుకుంటే ఇప్పటికి ఆశ్చర్యంగా ఉంటుంది — ఒక్కొక్కసారి ఇద్దరు ముగ్గురికి మాత్రమే సరిపడ అన్నం మిగిలేది. ఇంట్లో ఆనాడు పెద్దవాళ్ళ మందరం విందు భోజనాలు చేసిన వాళ్ళలాగా తేపుతూ ఆరకళ్ళులేవని ఎగేసి అది కాస్తా చిన్నవాళ్ళకి - అలాగా నటించ

డంరాని వాళ్ళకి మిగిల్చేవాళ్ళం. మాలో ప్రతి ఒక్కరికి తెలుసు ఒక్కొక్కరం ఇద్దరేసి తినేది తిన గలమని.

"బీద వాళ్ళం-అంటే వసుధః బీద వాళ్ళము కాదు. కొంత ఆస్తి ఉండేది ఒకప్పుడు. కాకపోతే నాన్నగారి మితి మీరిన ఖర్చులవలన, కొద్దిగా చీట్లాట వలన, కోర్టు దావాలవలన అదికాస్తా హరించిపోయింది." ఇదినేను బుద్ధితెలి శాకే జరిగింది. కాబట్టి నాకు ఏదో విధాన కొద్దిరోజులపాటు రుచిచూసిన ఆజీవితం మళ్ళీవస్తే బాగుండునని కలలు కంటుండేదాన్ని!

"అది ఆయన దురదృష్టమో, మా గ్రహబలమో తెలియదుగాని ఆయనకి మొదట కలిగిన ఇద్దరం ఆడపిల్లలమే. నాన్నగారికి చేతిలో ఆస్తి ఉన్నప్పుడే అక్కయ్య పెళ్ళీడుకి వచ్చింది కాబట్టి దాని అదృష్టం బావుండి బాగా కల వారింటి కోడలయింది. బావ బాగా ధనవంతుడు. అయితే అతని గుణాలు మాత్రం మంచివి కావని వచ్చినప్పుడల్లా అక్కయ్య చెప్పుకుని ఏడిచేది. అందు వలన నాకు మొదటినుంచి బావఅంటే సదభిప్రాయం లేకపోగా చాలా అస హ్యంగా ఉండేది. ఆయనకి లేని అల వాట్లు లేవుట! కాకపోతే ఆయనలోని ఒక్క సుగుణం ఏమిటంటే మా అక్కయ్య మా కుటుంబానికి సాయం చేస్తుంటే అడ్డుచెప్పేవాడుకాదు. అదే పెద్ద వరంగా భావించేవాళ్ళు మా వాళ్ళు."

"నా తరువాత ముగ్గురు తమ్ముళ్ళు న్నారు. అందులో పెద్దవాడికి నాకు అయిదేళ్ళు తేడా! ఇంతకీ నేను చెప్ప వచ్చేది - మా కుటుంబానికి త్వరగా అంది వచ్చేందుకు మగపిల్లలు లేకపోగా వయస్సు మీదికొస్తున్న నేను మాత్రం మావాళ్ళకిబరువుగా తయారయాను."

"నేను చిన్నతనంనుంచి స్కాలర్ షిప్‌తో చదువుకుంటూ ఇంటర్‌లోకి వచ్చాను."

"అప్పట్లో మాధవరావు-అదే" మీ మిత్రుడు - మా ఇంటికి ఎదురుగాఉన్న గదిలో అద్దెకుంటుండేవాడు. బాగా ఉన్నవాడు, పైగా వాళ్ళకుటుంబంలో ఒక్కగానొక్క మగపిల్లాడుట! అందు కని అతని దర్జాకి లోటుండేది కాదు. ఎప్పుడూ మడత నలగని డ్రస్సులో ట్రిమ్‌గా తయారయేవాడు. ఎడాపెడా స్నేహితులతో తిరుగుతుండేవాడు రోడ్లమ్మట" అని కాసేపాగి చిన్నగా నవ్వి "మీరు ఏదో అడుగుతే మా కుటుంబ చరిత్రంతా ఏకరువు పెడు తున్నాను. విసుగ్గా లేదుకదా?" అంది.

"అబ్బే, అటువంటిదేమీ లేదు లెండి. బాక్‌గ్రౌండు తెలియందే మీరు ఏ పరిస్థితుల్లో ." అని మాట పూర్తి చేయకుండానే ఆపేశాను.

మళ్ళీ [illegible]ంది ఇందిర —

"నేను [illegible]కదివరకే చెప్పాను — సుఖం అన్నది కొద్దిరోజుల పాటే అనుభవించాను కాబట్టి నాకు ఏవిధంగా నయినా తిరిగి దాన్ని పొందాలని, జీవితంలో 'లేమి' అన్నది లేకుండా బ్రతకాలని కోరికగా ఉండేది! కోరికే కాదు — అదెలాగయినా సాధించాలన్న పట్టుదల కూడా ఉండేది!

"నన్ను మా కాలేజీలో అందరూ 'మిస్ కాలేజి' అని పిలిచేవారు నా వెంటపడే మగపిల్లల్ని చూసీ, నన్ను చూసీ ఈర్ష్యపడే నా సహాధ్యాయినులని తలుచుకునీ నాకు ఒక గట్టి నమ్మకం ఏర్పడిపోయింది. — అది నాలో అందరినీ ఆకర్షించే అందం ఉందనీ, అదే నాకు భగవంతుడు పెట్టిన సొమ్మనీ! దాన్నే నా భవిష్యత్తుని బాగుపరుచుకునేందుకు ముడిసరుకుగా వాడదల్చుకున్నాను. అందం ఉంది, ఇంటర్ చదువుతున్నాను — ఏమిటి నాకు తక్కువ అని గర్వపడేదాన్ని! అది కేవలం మా ఇంటి వాతావరణం మర్చిపోయేందు కనుకునే మాట!

"మాధవరావు సాధ్యమయినప్పుడల్లా నావంక చూసేవాడు కాని వెకిలి వేషాలు మాత్రం వేసేవాడు కాదు రోడ్డుమీద కొంచెం అసభ్యంగానే ప్రవర్తిస్తాడని మా ఫ్రెండ్సు అనే వాళ్ళు కాని నాపట్ల మాత్రం అతను చాలా, గౌరవంగా ఉన్నట్టు నడిచే వాడు

"అతను చూపుల్తోనే నన్ను ఆరాధిస్తున్నాడని గ్రహించేందుకు నాకు అట్టే కాలం పట్టలేదు అది నాకు చాలా ఆనందాన్ని కలుగచేసింది కూడా మా మధ్య పరిచయం కలిగితే దాన్ని వృద్ధిచేసేందుకే నిశ్చయించుకున్నాను

"రోగి పథ్యమే అడిగాడు, వైద్యుడు పథ్యమే పెట్టమన్నాడు అన్నట్లుగా నేను ఇంటరు సెకండియర్ లో ఉండగా అతను కాలేజీకి ప్రెసిడెంటు అయ్యాడు ఆ హోదాలో అప్పుడప్పుడు మీటింగ్స్ అవీ ఏర్పాటు చేసేందుకు మా గరల్స్ వెయిటింగ్ రూంకి వచ్చేవాడు. అది కేవలం నాతో మాట్లాడేందుకేనని నాకు తెలుసు ఎందుకంటే మా సెక్రెటరీ ఒక మ్మాయి వేరే ఉన్నప్పటికీ నన్నే మాత్రమే ఉద్దేశించి మాట్లాడేవాడు. నేనూ చనువుగా మాట్లాడేసేదాన్ని

"ఈ విధంగా ప్రారంభమయిన మా పరిచయం ఇంటికి వెళ్ళే దారిలో అతను నన్ను కలుసుకోవడం, మేమిద్దరం కలిసి నడవడం, ఇంటి దగ్గర కూడా తన రూంలో ఉన్న మాగజైన్సు అతను నా కివ్వడం వగైరాలు జరుగుతుండేవి

'మీరు' లోంచి 'నువ్వు'లోకి దిగింది సంబోధన !

సరిగ్గా ఈ సమయంలో మా కుటుంబానికి పెద్ద దెబ్బ తగిలింది. పురుడొచ్చి మా అక్కయ్య పసికందుతో సహా కన్నుమూసింది !

అక్కయ్య నాతో చాలా చనువుగా ఉండేది. అందువల్ల దాని మరణం నా మీద బాగా ప్రభావం చూపించింది. లోకం అంతా అంధకారంగా కనిపించింది.

అప్పుడు మాధవరావు తనకి తెలిసిన వేదాంతం ఏదో చెప్పి నన్ను ఓదార్చ ప్రయత్నించేవాడు. దాంతో నాకింకా సన్నిహితుడయాడతను.

మా ఇంట్లో మాత్రం అక్కయ్య పోయిన విచారం ఒక పక్క ఉన్నా మా కుటుంబానికి అది చేసే సహాయం ఆగిపోవడం మరీ బాధించింది. మా వాళ్ళని బావని ఏ ముఖం పెట్టుకు అడగ్గలరు ?—అది లేకపోతే సంసారం గడిచేదెలా ?

అక్కయ్య పోయిన నెలకి మా అమ్మకి బ్రహ్మాండమయిన ఆలోచన వచ్చింది. అది బావని ఇతరత్రా పోనీయకుండా వాళ్ళకి "రొమ్ముల మీద కుంపటిలా ఎదిగి కూర్చున్న" నన్ను ఆయనకిచ్చి పెళ్ళిచేయడం ! ఈ ఆలోచన కలిగించిన ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయిపోయి నాన్నగారు బావని పిలిపించి అడిగారు. ఆయన వెంటనే ఎగిరి గంతేసి ఒప్పుకున్నాడు. ఒక అందమయిన అమ్మాయి వెతుక్కుంటూ చేతికి దొరుకుతుంటే కాదనేటంత తెలివి తక్కువవాడు కాదాయన.

నేను ప్రతిఘటించాను. నాకు ఏకోశానా ఆయనంటే గౌరవం లేదు. పైగా ఆయన వయస్సు నాకు రెట్టింపు పైన ఉంటుంది. 'నా జీవితం నాశనం చేయకండి' అని ఏడిచాను.

"మరి సంసారం గడిచేదెలా ?" అన్నది వాళ్ళ ప్రశ్న.

"నాకు ఇంటరు అయిపోయింది. కాబట్టి పాసయాక ఉద్యోగంలో చేరతాను" అన్నాను.

"పెళ్ళి, పెటాకులూ లేకుండా ఎన్నాళ్ళుంటావు ? అది మాకు అవమానం కాదూ ?" అన్నారు.

వాళ్ళు పరువుకోసం, వాళ్ళ సంరక్షణకోసం నన్ను బలిచేసేందుకు సిద్ధంగా ఉన్నారు. వాళ్ళు పరాయివాళ్ళయితే ఎదిరించేదాన్ని. కాని స్వంత తల్లితండ్రులు ! ఇక ఎవరితో చెప్పుకోను ?

— అంతా విని "నన్ను చేసుకుందుకు నీ కిష్టమేనా" అన్నాడు మాధవరావు. నాకు మాత్రం అంతకన్న కావలసిందేముంది ? నా కలలు ఫలించే రోజు వచ్చిందనుకున్నాను.



"అమ్మాయ్! రాత్రి ఆయనగారు నాకు 'సిగ్గు' అంటూ లేదన్నారే. కాస్త నీ దగ్గరుంటే యిద్దూ!"

"అవాళే మద్రాసు బయల్దేరి వెళ్ళిపోయాం. అక్కడ రిజిష్టర్ మారేజి చేసుకుని తరువాత వాళ్ళ వాళ్ళకి తెలియజేస్తానన్నాడు. వాళ్ళు తన మాట కాదంటే ఇంటికి వచ్చేది లేదని రాసేస్తానని — దాంతో హడలిపోయి దారికి వస్తారని అన్నాడు.

"ఒక నెలరోజులపాటు జీవితంలో డబ్బు అందించే సుఖాలన్నీ రుచి చూచాను. పెద్ద హోటల్లో మకాం— అప్పట్లోనే మీరు వచ్చింది కూడా!" ఆపింది ఇందిర — ఆలోచనలకి నాకు టైము ఇస్తూ.

అవును, మాధవరావు నాకు చిన్నప్పుడు స్నేహితుడు. మద్రాసులో ఏదో పనుండి వెడితే హటాత్తుగా కలిశాడు. వస్తేగాని వీల్లేదని ఆహో[illegible] గదికి లాక్కెళ్ళాడు. అక్కడే నేను ఇందిరని చూశాను.

"నా కాబోయే అర్ధాంగి — ఎలా ఉంది?" అని "కథంతా తర్వాత చెబుతాలే" అన్నాడు నవ్వుతూ.

నాకు మాత్రం నమ్మకం కల[illegible] లేదు. ఎక్కడో కొట్టుకొచ్చాడ[illegible]. ఈ అమాయకురాలిని ఏ గంగలో[illegible]నో కలిపి పరారవుతాడని అనిపించింది.

అలా ఎందుకనిపించిందో, నేనైతే చెప్పలేను బహుశా ఏమీలేని ఆ అమ్మాయిని చేసుకునేంత త్యాగం అతనిలో లేదని తెలిసి కాబోలు నా వెధవ ఆలోచనలకి నాకే అసహ్యం వేసింది వాళ్ళను దంపతులుగా చూసేందుకు ప్రయత్నించాను ఉన్న కాసేపూ

అప్పుడే కారియర్ తెప్పించి ఇందిరే నాకు స్వయంగా వడ్డించింది కొసరి కొసరి వేసి పారేస్తానంటే తన మీద ఒట్టేసుకుని తినిపించింది!

ప్రపంచంలోని ఆనందమంతా మూటకట్టుకుని దగ్గర పెట్టుకున్నట్లుంది ఆవాళ నేను చూసినప్పుడు అప్రయత్నంగా ఎదురుగా నున్న ఇందిరని చూశాను - చాలా భేదం కనిపించింది జీవితాన్ని శాసించే ధైర్యం కోల్పోయి అది నడిపినట్లల్లా నడుద్దామన్న నిర్లిప్తత ద్యోతకమవుతోంది

"తరువాత ఏమయింది?" అనడిగాను సిగరెట్టు ముట్టించుకుంటూ

"ఏముంది, మామూలుగా ఇలా తొందరపడేవాళ్ళకి జరిగేకథే ఇంటి దగ్గర ఇతని విషయం తెలిసి వాళ్ళ మావయ్య వచ్చాడు ఇద్దరూ కలిసి ఏదో మాట్లాడుకునేవాళ్ళు చివరికి ఒక రోజు సినిమాకి వెడతామని వెళ్ళిన వాళ్ళు మళ్ళీ రాలేదు అతని ఖాళీ పెట్టెలో మాత్రం ఒక వెయ్యి రూపాయలు, తన్ని క్షమించమన్న వేడుకోలు - తిరిగి ఇంటికి వెళ్ళిపొమ్మని సలహా ఉన్నాయి

కాసేపు ఆ వెయ్యిరూపాయలు చించి అవతల పారేద్దా మనిపించింది కాని అంతలోనే నాలోని యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం మేలుకుంది భద్రంగా అది పుచ్చుకుని ఇంటికి బయల్దేరాను మనస్సు బండబారిపోయింది ఎవరేమంటారోనన్న భయంపోయింది

ఇంటి దగ్గర తిట్లతో స్వాగతం పలికారు కాని నా దగ్గర ఉన్న వెయ్యి రూపాయలు వాళ్ళ కోపాన్ని అణగ ద్రొక్కేశాయి బీదరికం మనుష్యుల్ని అంతగా దిగజార్చేస్తుంది

అసలే బీదవాళ్ళం, అందులో స్వంత తెలివితేటలవలన ఒక మాయని మచ్చ తెచ్చుకున్నాను చివరికి మా బావకికూడా నేను తగని దాన్నయ్యాను నా కింక జీవితంలో పెళ్ళవుతుందన్న ఆశ పోయింది ఉద్యోగం కోసం ప్రయత్నించ సాగాను

కాని కోరని వరంలా వీరి సంబంధం వచ్చింది మా బాబాయి ఒకాయన ద్వారా నా గతం కప్పిపుచ్చారు వాళ్లూ పాపం అమాయకులు కాబోలు, నన్ను గురించి విచారించనేలేదు ఏ మాత్రం ఎవరినడిగినా నా చరిత్ర చెప్పేసేవారు కాని అటువంటిదేమీ జరగలేదు కట్నం అక్కరలేదన్నారు

తిరుపతిలో పెళ్ళి జరగాలన్నారు- అది మా వాళ్ళకి బాగా నేడుంది-ఊళ్లో జరుగుతే నోళ్ళు మూయడం కష్టమయేది.

అటునుంచి నేరుగా ఈవూరొొచ్చి కాపరం పెట్టాము కొత్తలో ఆయన మన్నుతిన్న పాములా నిర్లిప్తంగా ఉండే వారు ఏమడిగినా ఊకొట్టేవారు కాని ఇప్పుడు కొంచెం నయం - ఎవరయినా వచ్చినప్పుడయినా ఎంతో అన్యోన్యంగా ఉన్నట్టు మాట్లాడటం నేర్చుకున్నారు చివరికి పెళ్ళయిన ఎనిమిది నెలలకే నాకు మగపిల్లాడు పుట్టిపోయాడు అయినా ఆయనకి అనుమానం రాలేదు ఆ పాపం అక్కడితో ప్రక్షాళిత మయి పోయింది

'అయినా ఎన్నాళ్ళి అగ్ని పర్వతం పేలకుండా ఉంటుంది' అనిపిస్తుంది అప్పుడప్పుడు నిజం ఏనాటికయినా బయట పడక మానదు నేను ఇప్పుడు గడుపుతున్న జీవితం, ఈ డబ్బుఅంతా నీటి బుడగలాంటిదని నాకు తెలుసు అది ఏ నాడు పేలిపోతుందోనని అనుక్షణం ఆ భీతితోనే బ్రతుకుతున్నాను ఒక్కొక్కప్పుడనిపిస్తుంది - అంతా ఆయనకి చెప్పేసి ఆ రాబోయే ఫలితానికి తలఒగ్గుదామని కాని అంతలోనే పిరికితనం ఆవరించుకుంటుంది నా గతం తెలిసిననాడు ఆయన నన్ను క్షమిస్తారా అని" ముగించి నిట్టూర్చింది ఇందిర

నేను ఏమీ మాట్లాడలేదు ఆమె అన్న చివరిమాటలు నా చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి ఏ మగవాడయినా అటువంటి సన్నివేశాన్ని ఎదుర్కొన్నప్పుడు ఏం చేస్తాడు? నా మట్టుకు నేను ఏం చేస్తాను?

"ఇక లేవండి - ఇప్పటికే చాలా ఆలస్యమయిపోయింది పాపం మీ నిద్ర పాడు చేసుకున్నారు" అంటూనే తను లేచి మెల్లిగా ఇంట్లోకి వెళ్ళిపోయింది

నేనూ ఆమెని అనుసరించాను

మర్నాడల్లా నా స్వంత పనులమీద ఊరుని ఉద్ధరించడం సరిపోయింది సాయంత్రం ఇంటికి వచ్చేసరికి చలపతి చెప్పాడు - మర్నాడు వాడి పినతల్లి కొడుకు ఒకతను వస్తున్నాడని

నాకు కొంచెం కష్టమేసింది అది ఆయన వస్తున్నాడని కాదు - నేను అనవసరంగా ఇక్కడ దిగానని బస్తీల్లో ఒక అతిథి వస్తేనే అంతంత మాత్రంగా ఉంటుంది దాని మీద మరొకరుకూ వస్తే ఇక చెప్పవలసిన పనిలేదు అయినా నే వచ్చిన పని ఆ మర్నాటితో అయిపోతుందికదా అని సమాధాన పడ్డాను

ఉదయం మెయిలుకి స్టేషనుకి వెళ్ళి వెంటపెట్టుకుని వచ్చాడు చలపతి అతన్ని వచ్చిన మనిషిని చూసి [illegible] పోయాను -

దేముడు కూడా తన సృష్టితో



"బాబ్బాబు! ఈ ఖాతా పుస్తకాలుకూడా తీసుకుపోండి!

ఆడుకుంటాడు కాబోలు విచిత్ర సన్నివేశాల్లో మానవులని ఇరికించి చోద్యం చేస్తాడు

వచ్చేవాడు మాధవరావు!

వస్తూనే నన్ను చూసి "నువ్విక్కడున్నా వేమిటోయ్" అన్నాడు ఆశ్చర్యంగా

నవ్వి ఊరుకున్నాను. అతని రాక నాకేమీ నచ్చలేదు. కాని అందుకు అతన్ననవలసిన పని లేదు.

"నువ్వు వీడిని ఎరుగున్నా వేమిటిరా మాధవా - వీడు నాకు బెస్టు ఫ్రెండు మొన్న రోడ్డుమీద దొరుకుతే కొట్టుకొచ్చాను." అని నా వైపుకి తిరిగి "మా మాధవుడ్ని చూసి అప్పుడే నాలుగేళ్ళయిందిరా విశ్వం! వాడి లీలలు ఆ నోటా ఆ నోటా వినటమేకాని మనిషిని చూసే భాగ్యం లేకపోయింది. ఇన్నిరోజుల తరువాత ఇవ్వాళే!" అన్నాడు చలపతి.

ఇద్దరూ నవ్వారు.

నాకు మాత్రం నవ్వురాలేదు. ఎదురోకబోయే సన్నివేశాల్ని గురించి ఆలోచించుతున్నాను. ఇప్పుడు ఇందిరని పిలుస్తాడు పరిచయం చేసేందుకు!



అనామత్తుగా నేను చాలా డబ్బు వాడేశాను "

చలపతి గబగబ లోపలికి వెళ్ళి మళ్ళీ వచ్చి "కాఫీ తెస్తోంది" అన్నాడు

ఈ పరిస్థితిలో ఇందిరకి నా సహాయం కొంతయినా అవసరం అని గ్రహించి గబుక్కున లేచి పనున్న వాడిలాగా లోపలికి పోబోయాను అంతలోనే ఆమె ట్రే నిండా కాఫీ కప్పులను పెట్టుకుని ఎదురయింది

"ఇదుగో ఇందిరా, నే చెప్పలే వస్తాడని వాడే ఈ శాస్త్రి, మాధవరావు ఆవిడే నా మిసెస్" అంటూ పరిచయాలు చేశాడు చలపతి ఒకరి నొకరు చూసుకున్నారు రెండు అగ్ని పర్వతాలు పగలబోయాయి

ఇందిర చేతిలోంచి ట్రే జారి పడ బోతుందని గ్రహించి గబుక్కున [illegible]కున్నాను

"పాత అతిథిగారు అప్పుడే ఫామిలీ మెంబరయి కొత్తవారికి ఆతిథ్యం ఇస్తున్నారన్న మాట - వెరీగుడ్" అంటూ టేబుల్ ని ఖాళీ చేస్తున్నాడు చలపతి

"మీరు లోపలికి వెళ్ళి పంచదార తీసుకురండి" అన్నాను మెల్లిగా ఇందిరతో

టేబుల్ మీద. ట్రే పెట్టి కాఫీ కప్పులు అందించాను

"ఇందిరేదీ ?" అడిగాడు చలపతి

"పంచదార తెమ్మన్నాను"

"సరిపోయిందే !"

"నా క్కావాలి !"

మాధవరావు యాంత్రికంగా కాఫీ తాగుతున్నాడు వాతావరణం చాలా స్తబ్దంగా ఉంది అందుకని నేనే కల్పించుకుని -

"ఏం మాధవరావు, ఇప్పుడేం చేస్తున్నావు ?" అనడిగాను

"ఆఁ" అన్నాడు తెప్పరిల్లి

మళ్ళీ అదే ప్రశ్న అడిగాను

"నేనా విజయనగరం దగ్గర మాంగనీస్ గనులు తవ్విస్తున్నాము నేనూ మా మావగారూ కలిసి ఇప్పుడక్కడికే వెడుతున్నాను"

"అయితే పెళ్ళి అయిందన్న మాట !" అన్నాను ఆశ్చర్యంగా

తలెత్తి నా౦౼ చూసి తల వంచేసుకున్నాడు.

"అరే మాధవా-అన్నట్టు అమధ్య ఏవో కొన్ని లీలలు జరిపావని విన్నాను ?" అడిగాడు చలపతి

"ఏమిటీ ?" అన్నాడు మాధవరావు పరధ్యానంగానే

"పంచదార టేబుల్ మీద పెట్టండి" అన్నాను ఇందిరతో

"అదే, నువ్వు ఎవరో అమ్మాయితో మద్రాసులో ఒక నెల్లాళ్ళు వెలగబెట్టావని మావయ్య చెప్పాడులే ఆ విషయం "

పగిలి పోబోతున్న పంచదార సీసాని అమాంతంగా రక్షించాను !

ఇందిర గబగబ లోపలికి వెళ్ళి పోయింది

"ఇందిరకి ఇవ్వాళ ఒంట్లో బాగా లేదా ?" అన్నాడు నా వంక చూస్తూ చలపతి

నాకు నవ్వొచ్చింది

" 'తలనెప్పిగా ఉందన్నయ్యగారూ' అంది పొద్దున్న" అన్నాను

కాఫీలమధ్య ఏవేవో అడుగుతున్నాడు చలపతి అతని ప్రశ్నలు గాని వాటికి మాధవరావు జవాబులు గాని ఏవీ వినిపించడంలేదు నాకు ఈ పరిస్థితిని చక్కబరచడ మెలాగా అని ఆలోచిస్తున్నాను

కాఫీ లయాక "అలా పోయొద్దాం వస్తావా విశ్వం" అన్నాడు మాధవరావు

అతనుకూడా తెలివికలవాడే నని పించింది నా కా క్షణంలో "విత్ ప్లెజర్ — నీలాంటి లక్షాధికారికి కంపెనీగా ఉండటంకన్న ఆనంద మేముందోయ్ ?" అన్నాను నవ్వుతూ

"నేనూ వస్తున్నా ఆగండిరా" అంటూ లేవబోయాడు చలపతి

"పడిశావుగాని కూర్చో — కాఫీలు

తాగేవేళ భార్యాభర్తల మధ్య మే మెందుకని బయటికి పోతుంటే తనూ వస్తాట్ట! వదవోయ్ మాధవరావు" అని బయటికి నడిచాను.

హోటలుకి చేరుకుని ఒక మూల కూర్చునేదాకా ఇద్దరం మాట్లాడలేదు. అప్పుడు —

"నువ్వంత అసహ్యంగా ప్రవర్తించ గలవని అనుకోలేదోయ్" అన్నాను.

"ఇందిర చెప్పిందా ?"

"అవును — మొదట నన్నెరగ నట్టుగా ప్రవర్తించింది. పాపం మగ జాతి అంటేనే జడిసిపోయినట్టుంది. నేను తన రహస్యం రచ్చకీడుస్తానని భయపడింది."

" ........."

"అవునూ అలా ఆమెను వదిలి వెళ్ళేప్పుడు ఆమె భవిష్యత్తు ఏమవు తుంది అన్న భయం అయినా కలగ లేదూ నీకు ?"

" ........."

"సభ్య కుటుంబంలో పుట్టిన ఆడ పిల్ల, అందునా బీద ఇంటి పిల్ల — నువ్వు తెచ్చిన మచ్చ భరించలేక ఆత్మ హత్య చేసుకుంటే ఆ పాపం ఆ జన్మాంతం వెన్నాడేది తెలుసా ?"

" .........."

అతని మౌనం నన్ను మరీ రెచ్చ గొట్టింది "నీలాంటివాళ్ళు ఉండబట్టే మగవాళ్ళకి తుమ్మెదలు అన్న పేరు సామూహికంగా సంప్రాప్తమయింది. నువ్వు వదిలిపోయేప్పుడు ఆ అమ్మాయి వట్టిమనిషికూడా కాదుట తెలుసా ?"

ఆశ్చర్యంగా నావంక చూశాడు.

"అవునులే, నెల్లాళ్ళ అనుభవంకి ప్రతిఫలంగా వెయ్యిరూపాయలిచ్చావుగా - నీ మనస్సుకి డెబిట్, క్రెడిట్ సరిపోయుంటాయి.అప్పటినుంచి మళ్ళీ ఇవ్వాళే నీకు ఇందిర గుర్తుకొచ్చి ఉంటుంది"

చేతుల్లో ముఖం దాచేసుకున్నాడు మాధవరావు!

తెల్లబోయాను.

"నాటకంలో ఇదీ ఒక భాగమా?"

చేతులు తీసేసి తలెత్తి నా వంక చూశాడు. అతని కళ్ళలో నీళ్ళు నన్ను కరిగించేశాయి.

"నేను అప్పట్లో ఆ విషయం అంత సీరియస్‌గా తీసుకోలేదు విశ్వం. ఏదో తన పరిస్థితిని చక్కబరుచుకునేందుకు నన్ను వాడుకుంటోంద అనిపించింది. అందుకే మామయ్యవచ్చి డబ్బిచ్చి వదిలించుకోమంటే ఆట్టే ఆలోచించ కుండానే 'సరే' అనేశాను. అవతల లక్షరూపాయల కట్నంతో పిల్ల నీకోసం సిద్ధంగా ఉందంటే ఆనందపడ్డాను. కాబోయే మామగారికి ఇద్దరే కూతుళ్లు. ఏనాటికయినా ఆ మాంగనీసు గనులు ఆస్తిలో సగం భాగం నీదేనంటే నా అంత అదృష్టవంతుడు లేడనుకున్నాను.

"కాని ఇంధిరని వదిలి వెళ్ళిపోయిన మరుక్షణం గ్రహించాను - ఆమె నా జీవితంలో ఎంతటిస్థానాన్ని ఆక్రమించుకుందీ, ఎంతటి అమూల్యమయిన దాన్ని నేను పోగొట్టుకున్నదీను. దానికి తోడు నేను చేసుకున్న అమ్మాయికూడా నా పశ్చాత్తాపాన్ని వృద్ధిపరిచేందుకు సర్వవిధాలాతోడుపడుతోంది.డబ్బున్న దాన్నని అహంకారం. నన్ను లక్ష్య పెట్టదు. నాతో సరిగా మాట్లాడదు. తన్ని, తన ఆస్తినిచూసి చేసుకున్న వాడు ఎవడికోసం పడుండదన్నట్టుగా ఉంటుంది.

"నా కాపరంలో అనుక్షణం నాకు ఇందిర గుర్తుకొస్తుంది. ఆ నెలరోజులు దాంపత్యానికి నిర్వచనం లాంటివి. ఇప్పుడు మా ఇంట్లో జరుగుతున్న ప్రతి దానికి ఆ రోజులతో పోల్చి చూసుకుంటాను. ఎంతో తెలివి కనబడుతుంది.

"నేనెప్పుడూ గతంలోనే బ్రతుకుతుంటాను. ఆ నెలా నా జీవితంలో మరుపురాని కాలం"

నేను మాట్లాడకుండా వింటున్నాను.

"ఇందిర ఆత్మహత్య చేసుకుంటుందేమోనన్న భయం మాత్రం నాకు ఆట్టే కలగలేదు. ఎందుకంటే ఇందిర చాలా నిబ్బరమయిన మనిషి. ఎన్ని కష్టాలనయినా గుండె దిటవుతో ఎదుర్కో గలదు. దీనికితోడు ఆమె తిరిగి ఇంటికి వెళ్ళిపోయిందని, సలక్షణంగా పెళ్ళికూడా అయిందని విన్నాను. కాని ఆ పెళ్ళి జరగటం మా చలపతితోనేనని నేను కలలో కూడా అనుకోలేదు. తెలిస్తే ఇక్కడికి వచ్చేవాడినే కాను.

"ఇప్పుడు ఇందిర అనుకుంటూ ఉంటుంది తన జీవితం సర్వనాశనం చేసేందుకుమళ్ళీ నేను దాపురించానని" అని కాసేపాగి "నన్నిప్పుడేం చేయమంటావు? మళ్ళీ చలపతి ఇంటికి వెళ్ళబుద్ధి కావడంలేదు.'' అన్నాడు.

నేనూ కాసేపు ఆలోచించాను.

"అదే తప్పు. అతనికి లేని అనుమానాన్ని నువ్విప్పుడు అర్థంతరంగా అంతర్ధానం అయితే కలిగించిన వాడవవుతావు. కాబట్టి మనం మామూలుగానే ప్రవర్తించాలి. ఇంటికి పోదాం పద."

మాధవరావుకి మాత్రం ఆ పని ఇష్టంలేదు లాగుంది "నే నిప్పుడప్పుడే రాను. కొంచెం ఊళ్ళో తిరిగి మధ్యాహ్నంగా వస్తాను. చలపతి అడిగితే చెప్పు — స్వంత పని మీద ఎవడో ఝుంఝుంవాలాని కలుసుకునేందుకు పోయాడని. వాడీ వూళ్ళో పెద్ద వ్యాపారస్థుడులే. మా మాంగనీస్ ఓర్ ఎగుమతికి కంట్రాక్టరు"

ఇద్దరం విడిపోయాం.

నేను మాత్రం నేరుగా ఇంటికి చేరుకున్నాను. వరండా మెట్లెక్కుతున్న



"ఏమయ్యా అంత డబ్బు తీసుకున్నావ్ 'ఇంటికి రెండుసార్లు వెల్లవేస్తా'నని."
"రెండోసారి వెయ్యాల్సిన వెల్లనికూడ ఇందులోనే కలిపేసి ఒకసారే వేశేశానండి."

వాడినల్లా లోపలనుంచి మాటలు విన బడి గబుక్కున ఆగిపోయి పక్కగా నిలబడ్డాను.

కాని వినబడుతున్న ఆడగొంతు ఇందిరది కాదు. చలపతి ఎవరితోనో మాట్లాడుతున్నాడు. చాలా మెల్లిగా బాధతో కూడినట్లుంది అతని కంఠ స్వరం. అప్రయత్నంగానే వాళ్ళ మాటలు వినసాగాను -

"ఎలా ఉంది కళ్యాణీ జీవితం ?"

ఆమె నవ్వింది పేలవంగా.

"చూస్తున్నారుగా! కొన్నాళ్ళు ఇంట్లో ఖాళీగా కూర్చోవడంతో ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోయింది. జీవితం నిస్సారంగా కనబడింది. కనీసం ఏదయినా యాంత్రికంగా చేసుకు పోయే పనయినా దొరికితే బాగుండు ననిపించింది. దానికితోడు మా వాళ్ళు నేను ఏదయినా అఘాయిత్యం తలపెడతానేమోనని అనుక్షణం నా కదలికల్ని కనిపెడుతుండేవారు. చివ రికి మార్పులేని ఆ జీవితంతో విసిగి పోయాను. అదృష్టవశాత్తు ఈ ఉద్యోగం గురించి తెలిసింది. వెంటనే

అప్లైచేశాను. ఇది మూడు నెలలపాటు ఉంటుంది. ఇంటింటికి వెళ్ళి మా కంపెనీ వస్తువుల ప్రత్యేకత గురించి చెప్పడం, వాటికి నిదర్శనాలుగా వాటిని వాడి చూపించడం–ఇదీ కార్యక్రమం. జీతం మాత్రం బాగానే ముడుతుంది."

చలపతి నిట్టూర్చి "తరువాత ఏం చేద్దామని" అన్నాడు.

"ఇంకా ఆలోచించుకోలేదు. బహుశా ట్రైనింగుకి వెడతాను."

చలపతి ఆశ్చర్యపోయినట్టు కనిపించాడు. "అయితే ఇప్పట్లో.... పెళ్ళి చేసుకోవా ?"

"ఈ జీవితానికి అదొక్కటే తక్కువ. కాని ఎల్లకాలం ఇలాగే ఉంటానని మాత్రం అనను లెండి. మళ్ళి ఉద్యోగం మొహమ్మొత్తితే అప్పుడు"

కాసేపు ఎవరూ మాట్లాడలేదు. ఎవరి ఆలోచనలతో వాళ్ళు సతమతమవుతున్నట్టున్నారు. చివరికి చలపతే అన్నాడు "నీకు అన్యాయం చేశాను కళ్యాణీ – నీ జీవితం పాడుచేశాను" అని.

"మీరు చేసింది అంటూ ఏమయినా ఉంటే అంతకన్న ఎక్కువ నేనూ చేశాను. కాబట్టి నన్నూ నిందించండి ....విధి మనమీద కత్తికట్టింది–దాన్ని ఎదిరించే ధైర్యం ఇద్దరికీ లేకపోయింది. కాని ఒక్కటి మాత్రం నిజం. నేను ఏమాత్రం చేయూత నిచ్చినా మీరు నిలబడేవారు.... కాని ఇలా జరగడమే బావుంది లెండి. విలువలు మనకా వస్తువులు దూరమయినప్పుడే తెలుస్తాయి. మిమ్మల్ని జీవితంలో మరిచిపోలేను.... వెళ్ళిరానా మరి !"

"అప్పుడే....అవునులే వెళ్ళటమే మంచిది. పద" అంటూ లేచి ఆమెని అనుసరించాడు.

గేటుదాకా ఆమెని సాగనంపి ఆమె వెళ్ళినవైపే చూస్తూ నిలబడిపోయాడు గేటు కానుకుని. చేతిలోని రెక్జిన్ బాక్స్‌తో ఆమె మెల్లగా నడిచి వెళ్ళిపోతోంది.

మెల్లిగా వెళ్ళి వాడి పక్కనే నిలబడి బుజంమీద చేయి వేశాను.

ఉలిక్కిపడి నావంక చూశాడు. కళ్ళు నిండిన నీరు పొంగి కిందికి రాలింది !

"ఛ,ఛ, పిచ్చివాడిలా అదేమిటిరా! ఇంత మాత్రానికే బెంబేలు పడిపోతే ఎలారా – ఆ అమ్మాయి చూడు, ఆడపిల్లయినా అంతా హాలాహలంలా మింగి కర్తవ్య పాలనకోసం ఎలా వెడుతోందో ! పద లోపలికి" అంటూ వాడిని ఇంట్లోకి తీసుకెళ్ళాను.

కూర్చున్నాక నా సిగరెట్టు వెలిగించుకొని వాడిదీ, ముట్టించుతూ – "ఇందిర ఇంట్లో లేదా ?" అన్నాను.

"లేదు, తలనెప్పిగా ఉందంటే

బలవంతంగా డాక్టరు దగ్గరకు పంపిం చాను."

నేను వాడివంకే చూస్తూ కూర్చు న్నాను. నాకిన్నాళ్ళు తెలిసిన చలపతి వీడు కాదనిపించింది. చలపతికి కూడా జీవితంలో ఒక 'గతం' ఉంటుందని నేను కలలో కూడా అనుకోలేదు.

''చూశావుగా ఆ అమ్మాయిని ?''

"ఆఁ, కొద్దిగా అర్థం కూడా చేసుకో గలిగాను"

"విన్నా వన్నమాట !"

ఏమనాలో తెలియక " ఊ " అన్నాను.

''ఆ అమ్మాయి వాళ్ళ ఇల్లు మా ఇంటి వీధిలోనే ! చిన్నతనం నుంచి మా ఇంట్లో మా చెల్లెలితో ఆడు కుంటుండేది. దానికి చదువు చెపు తుంటే కళ్యాణికూడా వచ్చి కూర్చు నేది. చిలిపిగా ప్రశ్నలు వేస్తూ, అడిగిన ప్రశ్నలకి వెంటనే సమాధానం చెప్తుం డేది. సహజంగా నాకా అమ్మాయంటే ప్రత్యేక మయిన అభిమానం, ఆకర్షణ ఏర్పడ్డాయి. వయస్సుతో పాటు అవీ వృద్ధయాయి.

"వయస్సు వచ్చాక కూడా మా చెల్లెలిని అడ్డం పెట్టుకుని మా ఇంటికి వస్తుండేది. ఎవరూ చూడనప్పుడు మాట్లాడు కుంటుండే వాళ్ళం. అధవా ఎవరయినా చూసినా అట్టే పట్టించు కునే వారు కాదు. అదే నన్ను త్సాహ పరిచింది!

"చివరికి కళ్యాణి లేనిదే నా జీవితంలో సంపూర్ణత లేదని గ్రహిం చాను. ఆనర్సులో ఉండగా కూడా నా పరధ్యానానికి కారణం ధ్యాస ఎప్పుడూ కళ్యాణి మీద ఉండడమే! శలవలు ఇవ్వడం ఆలస్యం ఇంటిదగ్గర వాలేవాడిని. మా చెల్లెల్ని ప్రోత్స హించి దాన్ని సినిమాకి తీసుకెడుతూ కళ్యాణిని కూడా వెంటతీసుకు రమ్మనే వాడిని.

"మా చెల్లాయికి మా ఇద్దరి మధ్య పెరుగుతున్న ఆలోచనలు తెలుసు అది దానికి చాలా ఇష్టం కూడా: తన స్నేహితురాలు తనకి వదినగా వస్తుం దని మురిసేది! సినిమాలో మా ఇద్దరినీ ఒక పక్క చేర్చేది. కళ్యాణిని ఆ కాసేపూ 'వదినా' అని పిలిచి ఆ అమ్మా యిని సిగ్గులో ముంచేసేది.

"చివరికి నా పెళ్ళికి ప్రయత్నాలు జరుగుతుండగా చెల్లాయిచేత ఇంట్లో చెప్పించాను — అన్నయ్య 'కళ్యాణిని చేసుకుంటాడుట' అని.

"కాని మా ముగ్గురికి తోచనిది తోచినా మేము పట్టించుకోనిది ఒకట్టి ఉంది — అది మా మధ్యనున్న కులబేధం. కళ్యాణిది మా కులం కాదు.

"నువ్వా అమ్మాయిని చేసుకున్న

మరుక్షణం భావిల్లో దూకుతా నంది అమ్మ. కుటుంబ ప్రతిష్ట పోయాక బ్రతికేకన్న ముక్కు మూసుకుని హరీ మంటాను అన్నారు నాన్న.

"బ్రతిమాలాను. కళ్యాణి లేనిదే బ్రతకలే నన్నాను.

"కని పెంచిన మమ్మల్ని కాదంటా వన్నమాట. మనకు నిలంకా పిల్లని కోడలుగా తెచ్చుకున్నాక రేపు నీ చెల్లెల్ని ఎవరు చేసుకుంటారు అని బెదిరించారు. పోనీ; మేము పోయినా నువ్వయినా సుఖపడితే అదే పదివేలు అన్నారు ఆఖరు మాటగా!

"తెల్లబోయాను!

"అక్కడ కళ్యాణి సరిగ్గా ఇదే పరిస్థితిని ఎదుర్కొంది. ఇంటిల్లిపాదీ చావ సిద్ధమయారు — సత్యాగ్రహాలు మొదలు పెట్టారు -

"మీ ప్రేమ నిజమయితే దూరంగా ఉండి మనస్సులో ఒకరి నొకరు ఆరాధించుకోండి అన్నారు.

"చివరికి ఆప్తమిత్రులయిన వాళ్ళు కూడా నా ప్రయత్నాన్ని నిరుత్సాహ పరిచారు "రేపు మీకు పిల్లలు పుడతారు. వాళ్ళకి పెళ్ళి ఇటువంటి వాళ్ళనే వెతికి చేయాలి, కాని మంచి కుటుంబంలోని వారెవరూ చేసుకోరు. వాళ్ళ భవిష్యత్తేమవుతుంది? మీ తొందరపాటు వలన చివరికి మీకూ మనశ్శాంతి ఉండదు. మొదటి రోజుల్లోని 'తీపి' అయిపోయాక ఒకరిని చూసి ఒకరు అసహ్యించుకుంటారు. ఒకరికోసం ఒకరు త్యాగం చేశామని తాము చేసిన త్యాగానికి తగ్గట్టుగా అవతలి వాళ్ళు ప్రవర్తించడంలేదని బాధపడతారు. చివరికి మీ వాళ్ళకి ఆనందం ఉండదు మీకూ సుఖం ఉండదు' అన్నారు.

"నాకు తల తిరిగిపోయి కళ్యాణితో 'ఈ పాడు ప్రపంచానికి దూరంగా పోదాం రమ్మ'న్నాను.

"కాని కళ్యాణి కూడా చాలా దూరం ఆలోచించింది. "ఇందరిని కష్టపెట్టి మనం ఈ పని చేయడం కేవలం స్వార్థమవుతుంది. అంతకన్న మనం స్నేహితుల్లా విడిపోతే వాళ్ళ కోసం ప్రేమని త్యాగంచేసుకున్న సంతృప్తి అయినా ఉంటుంది. కాబట్టి నా మాట విని మీ సంకల్పం మార్చుకుని హాయిగా పెళ్ళి చేసుకోండి" అంది.

"అసలే చుట్టూ వింటున్న మాటలతో బెదిరిపోతున్న నేను కళ్యాణి కూడా అలా అనడంతో నీరు కారి పోయాను.

"అదే సమయమని గ్రహించి మా వాళ్ళు హడావిడిగా ఇందిరా వాళ్ళ సంబంధం వెతికి స్థిరపరిచారు. పెళ్ళి ఈ ప్రాంతంలో అయితే నా ప్రేమ కాండ అంతా వాళ్ళకి తెలిసిపోతుందని తిరుపతిలో చేయమన్నారు... పాపం



"హుం, ఇంత చిన్నవయసులో, మా అమ్మాయికి పెళ్ళి చెయ్యము."

వాళ్ళు ఒప్పుకున్నారు అటునుంచి నేరుగా ఈ ఊరొచ్చి కాపరం పెట్టాము

"కాని నిజం ఏనాటి కయినా తెలియక మానదు. నే నెంతో పవిత్రుడనని అనుకుంటున్న ఇందిర - ఇప్పటికి కూడా నా హృదయంలో ఒకమ్మాయి చెరగని ముద్ర వేసుకుందని తెలిస్తే ఏమనుకుంటుంది? నన్ను క్షమిస్తుందా ?"

నాకు నవ్వొచ్చింది.

ఇందిర వేసిన ప్రశ్నే చలపతీ వేశాడు. కాని కేవలం తమకొక్కరికే కాదని అవతలివారికికూడా జీవితంలో మాయని మర్చిపోలేని మచ్చలున్నాయని తెలుసుకుంటే ఒకరినొకరు క్షమించుకుంటారా? వాళ్ళహృదయాల్లోని బరువులుతొలిగిపోతాయా అన్న ప్రశ్న నాలోకలిగింది. ఇద్దరి జీవితాలూ తెలిసినవాడిని నేను. కాని మంచికిపోయి ఒకరి విషయం ఒకరికి తెలియబరిచితే చక్కబడటానికి బదులు పరిస్థితులు విషమిస్తే! ముఖ్యంగా ఆడది క్షమించగలదు గాని మగవాడు అంతటివిశాల హృదయుడుకాడు ఈ విషయాల్లో. ఇప్పుడు ఒకరినిచూసి ఒకరు జాలిపడుతున్నారు - తామేదో అన్యాయంచేసినట్టు. అప్పుడు తామేదో అన్యాయం చేయబడినట్టు అసహ్యించుకుంటే!

వాళ్ళ జీవితాలమీద ప్రయోగం చేసేంత ధైర్యం నాకులేదు!

ఇందిర రిక్షాదిగిలోపలికిరావడంతో ఆ ప్రసక్తి ఆగిపోయింది.

ఆరోజుసాయంత్రానికిగానిరాలేదు మాధవరావు.

రాగానే "మీ మద్రాసు అమ్మాయి మళ్ళీ కనబడిందేమో ననుకుంటు న్నాము" అన్నాడు చలపతి ఆలస్యా నికి కోపం తెలియజేస్తూ.

కొరడాతో కొట్టినట్లు ఉలిక్కి పడ్డాడు మాధవరావు. నేనుఖంగారుగా చుట్టూచూశాను. అదృష్టవశాత్తు ఇందిర గదిలోలేదు.

పొద్దున్ననగా ఇంట్లోంచి పోయి నందుకు మరికాసిని చివాట్లుతిని మాతో బాటు భోజనంచేశాడు మాధవరావు.

రాత్రి పడుకున్నానన్న మాటేగాని నిద్ర పట్టలేదు. ముగ్గురు చెప్పిన రెండు ప్రేమకథలు విన్నాను. అందులో ఒకటి దారుణంగా పేలిపోయింది. భగ వంతుడు సవ్యంగా చూడబట్టిగాని లేకపోతే ఆ విష ఫలితంనుంచి ఇందిర జీవితంలో కోలుకోలేక పతనమయి పోయి ఉండేది. లేదా గుండె దిటవులేని మనిషయితే అంతటితో జీవితాన్ని అంత మొందించు కునేది.

రెండవ ప్రేమకథ — చలపతి, కళ్యాణిలది - నాకు జాలి కలగచేసింది. కారణం వాళ్ళ ప్రేమ ఉదాత్తమయి నది. ఇతరులకోసం, పరువు ప్రతిష్టల కోసం వాళ్ళు విడిపోయారు. కళ్యాణి అన్నట్టు అందులో వారికీ ఒక విధ మయిన ఆత్మ సంతృప్తి ఉంటుంది. అయితే ఒక్క విషయం - వాళ్ళు అందరినీ ఎదిరించి పెళ్ళి చేసుకునుంటే మాత్రం వాళ్ళ జీవితాలు చాలా నికృష్టంగా తయారయేవి. కళ్యాణి చాలా ముందుచూపు కలది. అందంగా ఉంటుంది కూడా.

మగతగా పడుతున్న నిద్రలోంచి చిన్న చప్పుడుతో మెలకువ వచ్చింది. పక్క మంచం మీద మాధవరావు లేడు !

అనుమానం కలిగి వరండాలోకి వెళ్ళి నిలబడ్డాను. నిశ్శబ్దంగా ఉంది. మెల్లిగా దొడ్లోకి వెళ్ళాను. గుడ్డి వెన్నెట్లో ఇద్దరు వ్యక్తులు ఎడ మెడంగా నిలబడి ఉండటం కనబడింది.

"చేసింది చాలక నన్ను సర్వనాశ నం చేద్దామని వచ్చారా ? నేను బతి కుండటం మీకిష్టంలేదా ?" అంటోంది తీక్షణంగా ఇందిర.

"నన్నపార్ధం చేసుకుంటున్నావు ఇందిరా! చలపతి చేసుకుంది నిన్నని తెలిస్తే రాకనేపోదును. ఇందాక అటునుంచి అటే పోతానంటే విశ్వం ఆపాడు. 'చలపతికి అనుమానం కలుగు తుంది వెడితే' అని." అది మాధవరావు గొంతు.

కాస్సేపు నిశ్శబ్దం ఆవరించింది.

"నన్ను నమ్ము ఇందిరా - నేను చేసిన పనికి సిగ్గుపడుతున్నాను. బతి కున్నంత కాలం పశ్చాత్తాప్పడుతూనే

ఉంటాను. . నా జీవితంలో ఇంక శాంతి లేదు నీ కెటువంటి అపకారం చేసేందుకు రాలేదు నేను."

"సర్లెండి, మీరూ నేనూ ఒక ఇంట్లో తిరగడం అసంభవం. రేపు ఉదయం మీరు వెళ్ళకపోతే నేనే నా పుట్టింటికి వెళ్ళిపోతాను" అని గిరుక్కున వెనక్కి తిరిగి లోపలికి రాబోయినదల్లా నన్ను చూసి ఆగి చిన్నగా నవ్వి—

"అనుమానం వేసిందా అన్నయ్యగారూ ?" అంది

"అవును, ఎవరు ఏ అఘాయిత్యం తలపెడతారోనని !"

"రేపు ఈయనగారు ఇల్లు ఖాళీ చేయకపోతే నేనూ మీతోపాటు వస్తాను. మా పుట్టింటిలో దింపండి నన్ను" అంది.

"అలాగే" అని వెళ్ళి పడుకున్నాను. నా వెనకనే మాధవరావు కూడా వచ్చి పడుకున్నాడు

చలపతి లేపడంతో నిద్రలేచాను అప్పటికే బారెడు పొద్దెక్కింది.

"ఏమిటి, వా మాధవుడు చెప్పకుండా వెళ్ళి పోయాట్ట ?!" అనడిగాడు

పక్కనే ఉన్న ఇందిరవంక చూసి "అవునురా. రాత్రి విజయనగరం నుంచి వైరొచ్చింది ఉపయం మెయిల్‌కి వెడతాను, మా వాడికి చెప్పవోయ్ అని చెప్పి రాత్రే వెళ్ళిపోయాడు" అన్నాను.

ఇందిర తల ఒంచుకుని నిలబడి ఉంది

నేను బయలుదేరుతూంటే "అన్నయ్యగారూ, మీ మేలు జీవితంలో మరిచిపోలేను" అంది మెల్లిగా ఇందిర

"పిచ్చి పిల్లా, చెల్లెలి కాపరంలో ఒడుదుడుకులు రాకుండా చూడడం అన్నయ్య కర్తవ్యం కదూ — ఎప్పుడయినా పొరపాటున చలపతికి 'ఆ' విషయాలు తెలిస్తే నాకు ఉత్తరం రాయి." అన్నాను.

"తప్పకుండా" అంది నవ్వుతూ

సజల నేత్రాలతో నన్ను సాగనంపింది !

రైల్లో గడిచిన మూడు రోజులని సింహావలోకనం చేసుకున్నాను ఇద్దరి ద్వారా ఒక కథ విన్నాను మతి మరుపు మనిషి, బద్ధకస్తుడు అనుకున్న చలపతి గతం తెలుసుకుని ఆశ్చర్యపడ్డాను — ఎంతటి త్యాగం చేశాడా అని.

ఆలోచించగా నాకనిపించింది - పైకి చెప్పకపోయినా ప్రతి వ్యక్తి జీవితంలోనూ మరిచిపోలేని గత చరిత్ర, ఆ గతంలో ఒక మచ్చ ఉంటాయేమోనని ! నా మట్టుకు నాకు - క్షమించండి, ఇది నన్ను గురించిన కథ కాదుగా.

కథ ఇంకా అయిపోలేదు మరొక్క సంఘటన మిగిలేపోయింది

నేను ఇంటికి చేరుకున్న మూడవ రోజున మా చలపతి దగ్గరనుంచి ఉత్తరం ఒకటి వచ్చింది ఆత్రంగా విప్పిచూశాను అందులో ఇలా వుంది-

డియర్ విశ్వం,

మంచి స్నేహితుడి లక్షణం ఏమిటో తెలుసా - రహస్యాలు దాచకపోవడం నువ్వు నాకు మంచి స్నేహితుడివను కున్నాను ఇన్నాళ్ళూ మా ఇందిర ద్వారా నువ్వువిన్నది నాకుచెబుతా వేమోనని చూశాను కాని చెల్లెలి పక్షమే వహించావుగాని స్నేహధర్మం నెరవేర్చలేదు నువ్వు

ఇందిర గతచరిత్ర నాకుతెలిస్తే మా కుటుంబం ఏమయిపోతుందోనని మధనపడ్డావు - అంతా నేను గమనిస్తూనే ఉన్నాను కాని ఇన్నాళ్ళుగా నన్నెరుగున్న నువ్వు నన్నెందుకు అపార్ధం చేసుకున్నావా అని ఆశ్చర్యంగా ఉందినాకు నా మనస్సు అంత సంకుచితమని ఎందుకు అనుమానపడ్డావు ?

మా పెళ్ళయిన కొద్దిరోజులకే ఇందిరని గురించి అందరూ చెప్పారునాకు బహుశా నా దగ్గరనుంచి ఊహించిన మార్పు కనబడలేదు లాగుంది ఆ ప్రయత్నం మానుకున్నారు కాకపోతే ఆ వ్యక్తి మా మాధవుడేనన్న విషయం తెలిసింది మొన్ననే నాకు కావలసింది ఇందిర - ఆమె గతం నాకనవసరం

నీ
చలపతి

నా మీదనుంచి కొండంత భారం దింపినట్లయింది సమస్యాపరిష్కరించటం చేతకాక తప్పించుకుని వచ్చాను వాళ్ళ ఇంటినుంచి కాని దేముడు అనుకూలించాడు ఇక ఇందిరకి చలపతి జీవితంతో పరిచయంచేసే బాధ్యత మిగిలింది అది ఏమంత కష్టమయినది కాదని తెలుసు నాకు - ఎందుకంటే ఆడది క్షమామూర్తి



# సినిమా క్విజ్





పై రెండు బొమ్మలూ రెండు సినిమాల పేర్లు తెలియజేస్తవి  ఏమిటవి?

(జవాబులు 111 వ పేజీలో)

# నిజం చెబు నిషా తేసె!

స్టేషన్‌లో రైలు ఆగింది ఆమె ఒక కుర్రవాణ్ణి చంకన ఎత్తుకొన్నది రెండవ వాడి చెయ్యి పుచ్చుకొని రైలు దిగింది భర్త అంతకుముందే క్రిందికి దిగాడు పెద్దకూతురు ఆయన పక్కనే నిలబడివుంది సామాను యిద్దరు కూలీలు ఎత్తుకున్నారు అంతా వెయిటింగ్ రూమ్ వైపుకు బయలు దేరారు

ఆ స్టేషన్‌లో రెండున్నర గంటల కాలం వేచి వుండాలి ఆ తరువాత గాని వాళ్ళు వెళ్ళవలసిన రైలు రాదు

వెయిటింగ్ రూంలోకి వెళ్ళి వెళ్ళడంతోనే ఆమె ముగ్గురు పిల్లలకూ పక్కలు వేసి పడుకోమంది కొంచెం అనారోగ్యంగా వున్న భర్తను మప్లర్ చుట్టుకోమని కోప్పడింది

కొంత సేపు గడిచింది

'ఏమండోయ్ ! ఎవరోగాని—మనం రైలుదిగి యిక్కడకు వచ్చినప్పటినుంచీ నావైపు అదే పనిగా చూస్తున్నాడు! చూడండి అటు కాస్త !' అన్నదామె

'నీ ఆభరణాల్ని, అందాన్ని చూస్తున్నాడు ఇందులో అతని తప్పేమీ లేదు ఏమంటావు ?' అని అన్నాడు భర్త భూపతి '

'మీ మాటలు మరీ విచిత్రంగా వున్నాయి ఎవరైనా దొంగేమోనండీ !'

'నిన్ను చూస్తే దొంగలుకూడా పారిపోతారు ఏం ఫరవాలేదు !'

---

'ప్రబోధ్ కుమార్ సన్యాల్'

'ఏం ? ఎందుకని ?

'బెంగాలీ ఆడవాళ్లు కలకత్తా వదిలితే చాలు — వాళ్ళకు ఎక్కడలేని సాహసం వచ్చేస్తుంది ' '

'చాల్లెండి, మీ మాటలు ' — సరే గాని ఆ కూలివాళ్ళను కలకత్తా ఎక్స్ప్రెస్ ఎక్కించడానికి రెండున్నరకు రమ్మని చెప్పారా ? '

'చెప్పానుగాని — నన్ను కొంచెం సేపు పడుకోమంటావా ? నిద్ర వస్తున్నది ' '

'కొంచెం పాలుతాగి మరీ పడుకోండి ' ఫ్లాస్కులో వున్నాయి యిస్తాను '

'మరి నువ్వేం చేస్తావు ?'

'రెండు రోజుల లెక్కలు వ్రాసుకోవాలి ! ఆపని పూర్తయ్యేప్పటికి రైలు టైము ఎలాగూ అవుతుంది !'

ఆమె భర్తకు పాలు అందిస్తూ వెయిటింగురూము వాకిలి వైపు చూసింది పన్నెండు గంటలు దాటినా స్టేషన్‌లో జన సంచారం తగ్గలేదు వస్తువులు అమ్ముకునేవాళ్ళు — అదేపనిగా కేకలు పెడుతున్నారు దూరంగా రైలు ఇంజన్ కూతలు, గూడ్సు పెట్టెల మోతలు విన్పిస్తున్నాయి

ఆమెకు మళ్ళీ అతను కన్పించాడు

'ఏమండీ ! కొంచెం బయటికి చూడండి !' అని ఆమె మెడను చీరె చెరగుతో పూర్తిగా కప్పుకుంది ఆమెకు ఎందుకో భయం వేసింది

ఆమె భర్త వాకిలి వద్దకు వెళ్ళాడు ఆ యువకుని తలమీద టోపీ వుంది. అచ్చంగా బెంగాలీ వేషంలో వున్నాడు

'ఏమయ్యా ' ఏం కావాలి ?' అని ప్రశ్నించాడు భూపతి '

'అబ్బే ' ఏమీలేదండి ' .. మీరు నన్ను గుర్తుపట్టారో లేదో —, నా పేరు నిరంజన చటర్జీ అండి ' ఊ హుఁ మీరు నన్ను గుర్తించలేరు !' అన్నాడు యువకుడు '

మీరు నన్ను ఎరుగుదురా ?' భూపతి ప్రశ్నించాడు

'మీతో నాకు పరిచయం లేదు గాని, మీ ఆవిడను నేను బాగా ఎరుగుదునండీ అన్నాడు యువకుడు

'ఏమన్నావూ ? మా ఆవిణ్ణి బాగా ఎరుగుదువా ?'

'అవునండీ !'

'చాలా విచిత్రంగా వున్నదే ?'

నిరంజన్ చటర్జీ తనలోతాను నవ్వుకున్నాడు

'ఆమె పేరు శైలబాలాదేవి కదండీ? ఒకసారి యిలా పిలుస్తారా ?'

'అయితే మీరు ఆమెకు బంధువులన్నమాట '

'అంతకంటే ఎక్కువే ననుకోండి !'

'అంటే ?'

'కలకత్తాలోని గోవిందపూర్‌లో మేమంతా ఒకేచోట వుండేవాళ్ళం !'

'ఓహో ' మీరు బాల్య స్నేహితులన్నమాట ! బాగుంది ' అని భూపతి

నవ్వుతూ-లోపలికి రెండడుగులు వేసి- 'ఇదుగో! కొంచెమిలారా!' అని కేక వేశాడు

ఆమె రానని సైగచేసి చెప్పింది

"ఫరవాలేదులే రా! నీ చిన్ననాటి పరిచయస్థుడు' ఖద్దరు బట్టలూ ఈయనా చూస్తే - గాంధీగారి శిష్యుడు లాగా వున్నాడు' ఫరవాలేదులే రా'" అని భూపతి కేకవేసి చెప్పాడు

'నేనే లోపలికి వస్తాలెండి'' అని నిరంజన్ లోనికొచ్చాడు

'అరే' నువ్వటోయ్!' అన్నది శైలబాల ఆ యువకుణ్ణి తేరిపార చూసి

'ఎవరో చెప్పుకో చూస్తా!' అన్నాడు నిరంజన్ నవ్వుతూ।

'శ్రీకాంత్‌వి' అన్నది శైలబాల

'ఏమిటీ? శ్రీకాంతా'' అని ప్రశ్నించాడు ఆశ్చర్యంగా భూపతి!

'అవునండి' ఇతగాడి పేరు నిరంజనే అయినా చిన్నప్పుడు మేమంతా శ్రీకాంత్ అని పిలిచేవాళ్ళం ఎంత అమాయకంగా వుండేవాడని చిన్నప్పుడు! ఏమయ్యా' నీవిక్కడ ఎట్లా వూడిపడ్డావో చెప్పావు కాదు?' అని శైలబాల అతనికి మరింత దగ్గరగా వచ్చి నిలబడింది

'మనిషివి బాగా మారిపోయావు సుమా! చిన్నప్పుడు గాలికి కొట్టుకపోయే వగుశాకులాగా సన్నగా వుండే వాడివి! ఇప్పుడు బాగా లావయ్యావు కొంచెం రంగుకూడా మారింది ఏమిటి సంగతులు?' అన్నది శైలబాల - అతని వైపు చూస్తూ

"నన్ను శ్రీకాంత్' అని అంటేగాని నేను ఏమీ చెప్పను" అని అన్నాడు నిరంజన్ ముగ్గురూ ఒక్కసారిగా నవ్వారు

"ఏమండోయ్' ఇతన్ని మీరు మన పెళ్ళి రోజున చూసేవుంటారు అయినా పదకొండు సంవత్సరాలనాటి సంగతి'- ఇతనెవరో తెలుసునాండ? మా ఇంట్లో అద్దెకుండేవాళ్ళ - మణి పిన్నిగారి కొడుకండీ'. .ఏమయ్యా పిన్ని ఎక్కడున్నది?"

'లక్నోలో వున్నది'

'మీచెల్లెలు బావున్నదా? అనిమాకు పెళ్ళయిందా?'

"అయింది అందరూ యిప్పుడు అత్తగారింటికి వెళ్ళిపోయారు"

"ఏమయ్యా నిరంజన్! పెళ్ళి చేసుకున్నావా?"

'చేసుకున్నా''

'చేసుకున్నావా' మీ ఆవిడెక్కడ? పిల్లలు ఏమైనా?'

'ఒక మగపిల్లవాడు! పక్క గదిలో వున్నారు!'

'అలాగా! అయితే వచ్చి చూస్తాను. మేము గాలి మార్పుకోసం సిమ్లా వెళ్ళి వస్తున్నాం' అని అన్నది శైలబాల సంతోషంతో!

భూపతి వెళ్ళి పక్క మీద కూర్చున్నాడు

'మీ పెళ్ళి రోజున నేను భోజనాలు కూడా వడ్డించా నండోయ్ భూపతి ముఖోపాధ్యాయగారూ' అన్నాడు నిరంజన్ భూపతిని వుద్దేశించి!

'ఓహో! అలాగా!' అన్నాడు నవ్వుతూ భూపతి

'ఏమండోయ్' పెళ్ళి అయిన తర్వాత నేను మీతో వచ్చేస్తుంటే ఇతగాడు నా చెంగు పుచ్చుకొని నేనూ నీతో వస్తానని ఎలా ఏడ్చాడనుకున్నారూ? ఇప్పుడు తలుచుకుంటే సిగ్గేస్తున్నది'

'ఎందుకులే ఈ కబుర్లన్నీ? అత్తగారింట్లో కాలుబెట్టాక ఒక్క వుత్తరం ముక్కకూడా రాయలేదు నువ్వు! అంతే! ఆ తరువాత మేంకూడా ఆ యిల్లుమారి వెళ్లిపోయాం' అని అన్నాడు నిరంజన్

'ఎంత అన్యాయం' అన్నాడు భూపతి

'చాల్లెండి మీమాటలూ మీరూ' నేనలా వెళ్ళి ఇతగాడి పెళ్ళాన్ని, పిల్లవాణ్ణి చూసివస్తా' అని శైలబాల భర్తకు పాలుతెచ్చి యిచ్చింది

'ఏమయ్యా' నీకొడుకు వయస్సెంత?'

'సంవత్సరం!'

'నీ భార్య అందంగా వుంటుందా!'

'భార్యలు ఎప్పుడూ అందంగానే వుంటారు!'

'నిజంగానా?'

'నిజమే'

"మీ ఆవిడ నిన్ను బాగా ప్రేమిస్తుందా?"

'పిల్లలు పుట్టిన తరువాత యింకా ప్రేమా, చట్టుబండలూనూ!' అన్నాడు భూపతి

'నిరంజన్' ఈ ప్రశ్న నేను నీ భార్యనే అడుగుతాను'

'నిరంజన్ బాబుగారూ! మీ రెంత దాకా వెడుతున్నారు?' అని ప్రశ్నించాడు భూపతి

'ఇతగాణ్ణి 'బాబూ అని పిలవవలసిన అవసరం లేదులెండి పేరుతో పిలవండి, చాలు! ఇతగాణ్ణి చూడ్డంతోటే నా బాల్యమంతా నా కళ్లెదుట కన్పిస్తున్నది ఎంత గోలచేసేవాడూ' మమ్మల్ని ఎట్లా చెండుకు తినేవాడు'. మా బొమ్మల పెట్టెలో డబ్బులుకూడా బతక నిచ్చేవాడు కాదు' ఏమయ్యా' ఆ సంగతులన్నీ నీకు గుర్తున్నాయా?'

'ఉహుఁ' అన్నాడు నిరంజన్ నవ్వుతూ'

'సరే పద, వెడదాం' ఏమండీ టైమెంతయింది?' అని శైలబాల ప్రశ్నించింది

'ఒంటిగంటయింది మీరు వెళ్ళవలసినబండి రెండున్నరకు గాని రాదు మా లక్నో రైలు మూడింటికి వున్నది' అని అన్నాడు నిరంజన్

'మీరు పాలు తాగి కొంచెం విశ్రాంతి



రంగుల మామయ్యా

తీసుకోండి నేను ఇతగాడి భార్యనూ, పిల్లవాణ్ణీ చూసి వస్తాను '

'ఆc . ఆc వెళ్ళిరా' అన్నాడు భూపతి

'మీరుకూడా రాకూడదూ ?' అన్నాడు నిరంజన్

'వద్దులెండి , పిల్లలుకూడా వున్నారు మీరు వెళ్ళిరండి ,' అన్నాడు భూపతి

శైలబాల ఒక శాలువా తెచ్చి భర్తకు కప్పి — 'నే నిప్పుడే వచ్చేస్తాను,' అని చెప్పి నిరంజన్‌తో వెయిటింగ్ రూమ్ నుంచి బయటికి నడిచింది

* * *

స్టేషన్ బయట ప్లాట్‌ఫారమ్ పొగ మంచుతో నిండి వుంది జన సంచారం ఆట్టే కన్పించడం లేదు పొగమంచు కారణంగా మనుషులు దగ్గరకు వస్తేగాని తెలియడంలేదు ఏదో స్వప్నలోక వాతావరణం మాదిరిగా వున్నది ఒక చల్లని పిల్లగాలి వీచింది ఎందుకో శైలబాల హృదయం పులకించింది ఆమె తనను తాను విస్మరించుకున్నది బాహ్య ఆవరణ వదలి ఆమె బయటికి వచ్చేసింది

ఉభయులూ మౌనంగా కొంతదూరం నడిచారు

'శ్రీకాంత్ ! పక్కగదిలో వున్నదన్నావు, మీ ఆవిడ ' మనం చాలా దూరం వచ్చేసినట్టున్నాం మీ ఆవిడ ఎక్కడున్నది ?' అన్నది శైలబాల

ఆమె అందమైన మోహం వైపు

అలాగే చూస్తూ వుండిపోయాడు నిరంజన్ । అతని మనస్సు చెప్ప నలవి గాని ఆనందంతో నిండిపోయింది

'శైలా నువ్వేమీ అనకుండావుంటే ఒక మాట చెబుతాను '. నేను యింకా వెనుకటిలాగానే వున్నా ననుకో '' అన్నాడు నిరంజన్ ।

'అంటే ?' అన్నది శైలబాల ।

నేను పెళ్ళి చేసుకోలేదు '' అన్నాడు నిరంజన్ '

శైలబాల ఆశ్చర్యానికి మేర లేక పోయింది

'మరి మీ ఆవిణ్ణి చూపిస్తానని చెప్పా వేం ? ఆయన నేమనుకుంటారు ? ఇంతకూ నువ్వు పెళ్ళి చేసుకోలేదన్నమాట ,'

'ఉహుఁ । చేసుకోలేదు కొంచెం సేపు మాట్లాడి వెళ్ళిపో ।'

'అది సరే లే। ఇంతకూ నువ్వు నాతో అబద్ధం ఎందుకు చెప్పాలి ?''

'పెళ్ళి చేసుకోలేదని చెప్పడానికి నాకు సిగ్గేసి అలా చెప్పాను '''

'ఇప్పుడు ఏం చేస్తున్నటు ?'

"కలకత్తా లా కాలేజీలో చదువు కుంటున్నా చాలా సంవత్సరాల తర్వాత నిన్ను చూసేప్పటికి నా మనస్సుకు ఎంతో ఆనందంగా వున్నది ''

'అందుకే కాబోలు అబద్ధమాడావు '' అని శైలబాల నవ్వుతూ_వెనక్కు తిరిగి చూసి _ సరే లే' ఆయన పొరపాటున బయటకి వస్తారో ఏమో। కొంచెం దూరం ముందుకు వెడదాం పద। చూస్తే బావుండదు। మొత్తానికి నీ చిలిపి చేష్టలు పోనివ్వాపు కాదు 'అని అన్నది శైలబాల

'ఇలా నువ్వు నాకు కన్పిస్తావని కలలోకూడా అనుకోలేదు కాలగర్భంలో పదకొండు సంవత్సరాలు కలిసి పోయాయి మానవుడు నిత్యం స్వప్న లోకంలో విహరిస్తూ వుంటాడు శైలా।'

'అవునుగాని నువ్వు నన్నెలా గుర్తు పట్టావు ? మాటిమాటికి నావైపు చూస్తూ వుంటే ఎవరో అనుకున్నాను నిజంగా గతం ఎంత మధురమైంది। అంతా స్వప్నంలాగా వున్నది బాల్యస్నేహం ఎప్పటికీ మరువురాదనుకుంటాను । ఆ నాటి ప్రేమానుబంధాలే వేరు' ఇప్పుడు తలచుకుంటే అంతా విచిత్రంగా వుం టుంది నిన్ను చూసేప్పటికి నిజంగా నాకు ప్రాణం లేచివచ్చినట్టయింది ఏమి టలా చూస్తున్నావు ?'

'నిన్ను చూస్తున్నాను '

'నాలో ఏమి చూస్తున్నావు ?'

'నీ కాటుక కళ్ళు । ఏమీ మారలేదు నీ కళ్ళల్లోని కాంతి ।'

'దయ్యపు కళ్ళు అని ఎగతాళి చేసే వాడివి కదూ చిన్నప్పుడు ?'

'నీ వెనుకటి సౌందర్యంకూడా చెక్కు చెదరలేదు । అలాగే కుందనపు బొమ్మ లాగా వున్నావు '

'చాల్లే నీ కబుర్లు । ఇప్పుడు నేను

ముగ్గురు పిల్లల తల్లినయ్యాను. అలా ఇంకొంచెం ముందుకు వెడదాం పద!

'చీకటిగా వుంది రాళ్లూ రప్పలు, ఎగుడు దిగుళ్లూ వుంటాయేమో!'

'ఉంటే వుండనివ్వు' ఈ చలిలో యిలా నడవడం నాకెంతో బావున్నది. నిరంజన్! నువ్వు పెళ్ళి చేసుకోకపోవడమే మంచిది పెళ్ళిఅంటే ఒక బంధనం లాంటిది! ఒక మాయాజాలం లాంటిది ఈ వ్యూహంలో చిక్కుకుంటే బయటికి రావడం అతిదుర్లభం మరొకరి చెప్పు చేతల్లో బతకాలి ఇష్టంవచ్చిన రీతిగా జీవించడానికి అధికారం వుండదు హాయి అంటే నీదేనోయ్'

అలాగే ఉభయులూ ప్లాట్‌ఫారమ్ చివరదాకా నడిచివెళ్ళారు వాళ్ళకిప్పుడు ఏ బంధనమూ లేదు, ఎవరి ఆటంకం లేదు వర్తమానాన్ని వదిలేసి ఒక్కమారుగా వాళ్ళిద్దరూ గతంలోకి వెళ్ళిపోయారు వాళ్ళ వయస్సుల్ని వాళ్ళు మరచిపోయారు శైలబాల తన ఆచరణలో రవ్వంత దోషంకూడా వున్నట్లు భావించడంలేదు నైతిక బంధనాలను గురించిసైతం ఆమె ఆలోచించడంలేదు

'మీ ఆయన నాకు చాలా నచ్చాడు చాలా మంచివాడులా కన్పిస్తున్నాడు అన్నాడు నిరంజన్

'మంచివారే కాని, ఆరోగ్యం అంత మంచిది కాదు ఏదో నెట్టుకొస్తున్నా ఆయన సంగతి అలావుంచు శ్రీకాంత్... యిక్కడ గాలిలో ఎంత సువాసన వున్నదో గమనించావా?'

'అటుచూడు—అక్కడ విరిసిన గులాబీలున్నాయి అందుకే ఈ సువాసనలు జాగ్రత్త, రైలుపట్టాలు '

శైలబాల అతని చేతిని తన చేతిలోనికి తీసుకున్నది

'శ్రీకాంత్ యిక్కడ నాకెంతో హాయిగా వుంది నిజం చెబుతున్నాను — నేను చాలా ప్రదేశాలు తిరిగాను గాని — యింత హాయిని నేనెప్పుడూ అనుభవించలేదు నా మనసంతా దూదెపింజెలా స్వేచ్ఛగా, తేలికగా గాలికి ఎగిరిపోతున్నది ఈ మెత్తటి పచ్చటి గడ్డిమీద యిలాగే కూర్చుండిపోవాలనిపిస్తున్నది మన చుట్టూ ఆవరించివున్న పొగమంచు కూడా నాకెంతో వుల్లాసాన్ని కలిగిస్తున్నది ఈ చల్లని కమ్మని గాలికి నా మేను పులకిస్తున్నది

'అవును! ఇక్కడ ఎవరూ లేరు — నువ్వూ నేనూ, నీలాల నింగీ, ఆ నింగి మీద మిలమిల లాడే తారకలు తప్ప! ఇది ఎంత మధురమైన రేయి!' అన్నాడు నిరంజన్!

'మనం ఉభయులం ఈ రోజు యిలా కలుసుకోవడం ఎంత విచిత్రం! రేపటికిది నాకొక స్వప్నం లాగా తోచవచ్చు ఇంకొంచెం ముందుకు వెడదాం శ్రీకాంత్!'

ఇంకా ముందుకా?

'అవును' నీవెంత దూరం తీసుకెడితే

అంత దూరం రావడానికి నేను సిద్ధంగా వున్నాను '

''ఆలస్యమైతే మీ ఆయన ఖంగారు పడతా రేమో ?''

'శ్రీకాంత్ ' నువ్వు నాకు వర్తమా నాన్ని గుర్తు చెయ్యకు ' మరుగుపడిన జ్ఞాపకాలన్నీ నాకిప్పుడు తలపుకు వస్తు న్నాయి ఈ గాలి లో ఏదో మత్తు వున్నది ఇంకొంచెం దూరం వెడదాం పద ' ' అని ఆమె కన్నెత్తి విన్నవించింది

'అవును ఈ గాలిలో, ఈ రాత్రిలో ఏదో మత్తువుంది రేపటికి యిదంతా కలగా మారిపోతుంది ఆ నాడు నా వయస్సు కారణంగా నిన్ను గుర్తించ లేదు ఈ నాడు గుర్తించాను, కాని ఈ గుర్తింపుకు ప్రయోజనంలేదు ఇంకొంచెం సేపటికి నీ లోకంలోకి నువ్వు వెళ్ళి పోతావు నిన్ను నేను పదకొండు సంవ త్సరాల క్రితం చూశాను, అసలు జీవి తాంతంవరకు నిన్ను చూడకుండావున్నా ఏమీ జరిగేది కాదు, కాని ఈ రోజున మాత్రం నువ్వు నా నుంచి దూరంకావడం యిష్టంలేకుండా వున్నది ఈ రోజున మనం ఉభయులం గతానికి, భవితవ్యానికి మధ్యన నిలబడివున్నాం'' అన్నాడు నిరం జన్-గొంతు ఆమె చేరువకు తెచ్చి '

రైల్వే లైను దాటి వాళ్ళిద్దరూ మరి కొంచెం ముందుకు నడిచారు ఆ దారి ఎక్కడికి వెడుతుందో, ఏమో వాళ్ళకే తెలియదు తెలుసుకోవాలని కూడా వాళ్ళకులేదు చెట్లూ-చేమలూ-పుట్టలూ-మైదానాలూ దాటుకుంటూ ముందుకు సాగిపోతున్నారు-

'శైలా ' ' అన్నాడు నిరంజన్ కొంత దూరం వెళ్ళిన తరువాత

'తిరిగి వెడదామని అనకు శ్రీకాంత్ ' ' అని శైలబాల మరింత చేరువకు వచ్చి, అతని భుజం మీద తల ఆనించి ప్రాధేయ పడింది

'ఈ రోజుకు నువ్వు పరాయిదానవై పోయావు అయినా నేనొక సంగతి చెప్పడానికి సంకోచించడం లేదు ' అని నిరంజన్ ఆమె భుజం మీద తన చెయ్యి వేసి అన్నాడు

'ఏమిటా సంగతి చెప్పు ' ' అన్నది శైలబాల -కను లరమోడ్చి '

'ఆనాడు చెప్పలేక పోయాను ఈ నాడు చెప్పడానికి నా మనస్సు ఎంతో వేగిర పడుతున్నది కాని ఆ విషయం చెప్పాలంటే నా కీనాడు కొంచెం సిగ్గుగా వున్నది '

శైలబాల నిట్టూర్చింది

'చాలా ఆలస్యమైంది శ్రీకాంత్ ' అయినా వినడానికి నా కేమీ అభ్యంతరం లేదు చెప్పు వింటాను '

'ఆనందాతి రేకంతో నా హృదయం పరవళ్ళు తొక్కుతున్నది నీ పొడుగాంటి శిరోజాలనుంచి గుబాళిస్తున్న పరిమళం పదకొండు సంవత్సరాల విరహాన్ని వ్యక్తం చేస్తున్నది శైలా ' 'నేను నిన్ను



“ఏవిట్రా అబ్బాయ్-అంత తీవ్రంగా ఆలోచిస్తున్నావ్ ?”
“మరే రాములవారు అరణ్యవాసానికి వెళ్ళేటప్పుడు రేజరూ అవీ తీసుకు పోయినట్టు నే చదవలా — మరి దండకారణ్యంలో బ్లేడులూ అవీ అమ్మే అంగళ్ళున్నట్లు రాయడం వాల్మీకి ఎందుకు మర్చిపోయాడూ ? అని ”

---

ప్రేమిస్తున్నానని చెప్పుకునే తరుణం దాటి పోయింది నువ్వు మాతృస్థానాన్ని కూడా అలంకరించావు ఇప్పుడు మన వుభయులకు ఎటువంటి సంబంధమూ లేదు ! గతంలో మరుగుపడిపోయిన జ్ఞాపకాలు మాత్రమే మనకు మిగిలాయి ’’

‘అవును శ్రీకాంత్ ! జీవిత మంటే ఏమిటో తెలియని రోజున, నీవు నాతో స్నేహం చేశావు జీవితమంటే ఏమిటో కళ్లు తెరిచే నాటికి పాత స్మృతులన్నీ గతంలో కలిసిపోయాయి ఒక్కటీ మిగలలేదు ఈనాడు నిన్ను చూడడంతో ఒక్కటొక్కటే అన్నీ గుర్తు కొస్తున్నాయి శ్రీకాంత్ ! ఇవ్వాళ నువ్వు పెద్దవాడ వయ్యావు, కాని నా స్మృతిపథంలో మాత్రం నీ బాల్యరూపమే నిలిచివుంది ఆ రూపమే నాకు చాలా యిష్టమైంది ! ఏమంటావు ?’ అని చెమ్మగిల్లిన కళ్ళతో అన్నది — శైలబాల !

“నేనేమంటాను ? — నేను ఏమీ అనలేను ! నువ్వు నా కేమవుతావో నాకే తెలియడంలేదు — నేను నీకు సోదరుణ్ణి కాదు, చుట్టాన్ని కాదు — ఏదో ఒక తెలియని సంబంధం మాత్రం మనిద్దరి మధ్యన వున్నది ! అంతే !” అన్నాడు నిరంజన్— అవ్యక్తమైన విషాద స్వరంతో !

‘ఇంకా చెప్పు శ్రీకాంత్ ! నీ మాటలు వినాలని నా మనస్సు ఎందుకో ఆరాట

పడుతున్నది! మనకు మిగిలింది ఈ ఒక్క రాత్రే నేమో! ఈ పదకొండు సంవత్సరాల కాలంలో నే నెప్పుడూ నిన్ను గురించి ఆలోచించనేలేదు కాని ఈ క్షణంలో మాత్రం నిన్ను గురించి తప్ప మరొక విషయం ఆలోచించటానికి నాకు మనస్కరించడంలేదు నీ కివ్వటానికి నా దగ్గిర ఏమీలేదు నీనుంచి ఏమి పొందాలో కూడా నాకు పాలుపోవడంలేదు నా హృదయంలో ప్రవహించే రక్తం ఉరకలు పెడుతున్నది' అని ఆగిపోయింది. అర్థంకాని దుఃఖం ఆమెను కబళించగా!

అడుగులో అడుగు వేసుకుంటూ వాళ్ళిద్దరూ యింకా ముందుకు సాగిపోతున్నారు ప్రశాంతంగా వున్న ఆ నట్టనడిరేయి, అగమ్యమార్గాన బడి ఒకరికి మరొకరు తోడుగా, నీడగా నడిచి వెడుతున్నారు ఎక్కడికి వెడుతున్నారో, ఎందుకు వెడుతున్నారో వాళ్ళకే తెలియదు! అవ్యక్తమైన ఏదో ఒక మధుర భావం వాళ్ళ నలా నడిపిస్తున్నది, ఏదో తెలియని ఒక అనుబంధం వాళ్ళ నలా ముందుకు సాగిపొమ్మని ఆదేశిస్తున్నది ఉభయులూ ఊహల దోనెల్లో విహరిస్తూ ముందుకు ఇంకా ముందుకు సాగిపోయారు

*　　*　　*

'నిరంజన్!' అని పిలిచింది – శైలబాల తడబడుతూ ఆమె జుట్టుముడి వూడిపోయింది ఆమె తూలి కింద పడబోయింది నిరంజన్ ఆమెను రెండు చేతులతో పట్టుకుని పైకిలేపుతూ–'ఏమిటి శైలా?' అన్నాడు

'ఏమిటో నోటినుంచి మాటలు పెగిలి రావడంలేదు గొంతు పూడిపోయినట్టుగా వుంది'

'వెనక్కి తిరిగి వెడదాం పద!'

శైలబాల నిరంజన్ వైపు చూసింది–కనురెప్ప అయినా కదల్చకుండా

'నిరంజన్! నీమీద ఎవరైనా నింద మోపితే – తప్పు నాదికాదని చెప్పు! ఈమే నన్ను ప్రేరేపించి బయటికి తీసుకెళ్ళిందని చెప్పు!'

'అలిసిపోయినట్టున్నావు వెళదాం పద!'

'నిరంజన్! మరికొంచెంసేపు నన్ను నీతో వుండనివ్వు'

'శైలా!'

'ఏమిటి?'

'మనం చేసింది పొరపాటా?'

'ఏమో?'

'ఇలా చేయడం తప్పుకదూ?'

'నిరంజన్! నేను ఈ రోజున నీకు చాలా దగ్గరగా వచ్చాను నేను నిన్ను మరిపించి మురిపించి, ఇంతవరకు తీసుకొచ్చాను నన్ను మన్నించు నిరంజన్!' అని శైలబాల విన్నవించుకున్నది

'మన్నించడానికి నువ్వు చేసిన తప్పేమిటో నాకర్థం కావటం లేదు

మనిద్దరం. యింకా చిన్న పిల్లలమే!' అని అన్నాడు అపేక్షగా నిరంజన్!

ఇద్దరూ వెనక్కి నడిచి స్టేషన్ చేరుకున్నారు అక్కడ దీపాల కాంతిని, జన సందోహాన్ని చూసే సరికి వాళ్ళ కలలన్నీ కరిగిపోయాయి

'శైలా, కళ్ళు తుడుచుకో, .. రెండున్నర కావస్తున్నది నీ చిరునామా ఏమిటో చెప్పు' అని అన్నాడు నిరంజన్.

శైలబాల జుట్టుముడి సరిజేసుకుంది కళ్ళు తుడుచుకొని చీర చెంగు సర్దుకుంది

'గానుగ ఎద్దుల్లాగా మళ్ళీ మనం మొదటికే వచ్చామన్న మాట! బావుంది-' అని మాత్రమే అనగలిగింది శైలబాల

ఆమెను వదిలి వెళ్ళవలసిన సమయం ఆసన్నమవుతున్నందుకు బాధ డుతూ నిరంజన్ ఆమె మొహం వైపు తదేకంగా చూస్తున్నాడు

సరిగ్గా అదేసమయానికి వెనుకనుంచి ఎవరిదో కంఠస్వరం విన్పించింది

'ఎక్కడున్నారండీ యిప్పటిదాకా, మీ కోసం స్టేషన్ అంతా వెదికాను, ఆమె ఎవరండీ? ఆమెవైపు ఎందుకలా చూస్తారు?'

శైలబాల స్తంభించి పోయింది - ఈ మాటలకు! నిరంజన్ నిలువునా నీరైపోయాడు

'ఎవరీమె?' అని అడిగింది శైలబాల నెమ్మదిగా

'నా భార్య!' అన్నాడు నిరంజన్ - నూతితోనుంచి మాట్లాడుతున్నట్టు

శైలబాల మొహం ఒక్కసారిగా కోపంతో కందగడ్డ అయిపోయింది తన కోపాన్ని అణుచుకుని-'మరి పెళ్ళి చేసుకోలేదని చెప్పావేం?' అని అన్నది - ముందుకు సాగుతూ

నిరంజన్ నోటివెంట మాటరాలేదు తల దించుకున్నాడు

శైలబాల నిరంజన్‌వైపు ఈసడింపుగా ఒకచూపు చూసి విసురుగా వెయిటింగు రూంవైపు వెళ్ళిపోయింది

నిరంజన్ లజ్జించుకున్నాడు

అనువాదం మహీధర్

---

సినిమా క్విజ్ జవాబులు

1 ప్రియురాలు

2 పేరంటాలు



చూపు లో చూపు



మానుమాటున

# మంచివాడి ప్రేమ

## జె. జవహర్లాల్

శేషగిరిని తల్లి రోజూ పోరు పెట్టసాగింది — 'పెళ్లి చేసుకోరా నాయనా' అని ఆమె అలా పోరు పెట్టటం మొదలు పెట్టేవరకు అతడు పెళ్లిని గురించి ఆలోచించలేదు 'కామం' అరిషడ్వర్గాల్లో ఒకటి ఆ విషయం తెలిసినవాళ్లు కూడా పెళ్లికోసం ఎందుకిలా ఎగబడతారు ? — పంచదార లైసెన్సుకీ, పర్మిట్లకీ ఎగబడినట్లు ? పెళ్లయితే స్త్రీకి బానిసత్వం అంటారు కాని అదేమి చిత్రమోమరి— స్త్రీలే పెళ్లికోసం ఎగబడుతున్నట్లు తోస్తుందతనికి పెళ్లి కాకపోతే బ్రతకలేనట్లుగా జనానికి ఎందుకో "వేలంవెర్రి" అనుకునేవాడు

కాని 'అంతా నీకన్నా తెలివి తక్కువవాళ్ళయి చేసుకుంటున్నారా పెళ్లిళ్లు ?' అంది తల్లి శేషగిరి చాలా వినయం గలవాడు 'నాకూ కొంత తెలుసు'ననే గర్వం అతని కెప్పుడూ లేదు అందువల్ల అందరూ చేసుకుంటున్నారంటే అందులో ఏదో ప్రత్యేకత ఉండి ఉండాలి అయినా పెళ్లయితే ఎలా ఉంటుందో చూడకుండా అలా విమర్శిస్తే సబబా అనిపించింది

కాని నైతికంగా ఓ చిక్కొచ్చింది 'కామం' శత్రువర్గంలో చేర్చబడిందేమిటి ? పురుషార్థాల విషయం వివి మరీ తికమకపడ్డాడు అది అరిషడ్వర్గాల్లోనూ ఉంది పురుషార్థాలలోనూ ఉంది అంటే అది మంచా ? చెడా ? వాంఛనీయమా ? కాదా ? అనేది సమస్య అయింది వేమన్న మాట సహాయం చేశాడు 'కామిగాని మోక్ష కామిగాడు' అని ధైర్యం చెప్పాడు అందువల్ల మొత్తంమీద పెళ్లిచేసుకోవటం తప్పుగాదని నిర్ణయించుకున్నాడు శేషగిరి తన స్థితి తనకు తెలుసు ఎంత లేదనుకున్నా తనకూ పెళ్లి చేసుకోవాలనే అనిపిస్తుంది అది తప్పుగాదని నిర్ణయించుకుని సంతృప్తిపడ్డాడు అసలా ఆత్మసంతృప్తి కోసమే ఆ నిర్ణయం చేసుకున్నాడేమో — చెప్పలేము

మొత్తంమీద పెళ్లిచేసుకోవటానికంగీకరించాడు శేషగిరి కాని ఎవర్ని, ఎలాంటివారిని చేసుకోవాలో తెలియలేదు, ఆ విషయం ఇంకా ఆలోచించుకోవాలన్నాడు

'మామయ్యగారి లక్ష్మి ఉంది గదరా!' అంది తల్లి

'ఉంటే ?'

'దాన్ని చేసుకోరాదూ ?'

'ఆదేం ఆవా ? గేదా ?' అన్నాడు

ఆమెకేం అర్థంగాక నోరు తెరచి, నోటిమీద చెయ్యి వేసుకొని 'హ వ్ వ్ వ' అంది,

'మరి లేకపోతే ఏమిటే? మామయ్య గారి అమ్మాయి అయితే దాని యిష్టా యిష్టాలు లేకుండా చేసుకోవటమేనా ?'

'ఓరి మోడా ? అదా సంగతి ? అది పుట్టినప్పట్నుంచీ అంటుండేవాడు మా నాన్న .'

'మీ నాన్న అంటే వాళ్ల నాన్న కిష్టం లేకపోవచ్చు '

'మా అన్నయ్యని నే నొప్పిస్తానుగా?'

'దేనికి ?

'పెళ్లికి.'

'అలాంటి ఒప్పించటాలు నాకేం ఇష్టంలేదు. అలాంటివి నువ్వేం చెయ్య గూడదు' ఇని శాసించాడు — అతని జీవి తంలో మొదటి శాసనం కాని తల్లి ఆగ లేదు వెళ్లి సోదరుణ్ని అడిగింది 'ఆలోచిద్దా !' అన్నాడాయన శేషగిరి సంగతి ఆయనకి బాగా తెలుసు వాడు చాలా మంచివాడని చాలా మెచ్చుకున్నాడు గూడాను

'అందుకే, నీ కూతుర్నివ్వరా వాడికి '

'మంచివాడే కాని, .. బ్రతకనేర్చిన వాడు కాదే '

'బాగానే ఉందిరోయ్. మంచివాడే నంటావు, మళ్లీ బ్రతక లేడంటావు ఎంతకలికాలమయినా మంచితనానికి చోటు లేకపోలేదు '

'అది కాదే ఇప్పుడు లక్ష్మి చదువు కుంటుందిగా . ఇప్పుడే ఎందుకా సంగతి ?' అని సమాధానం చెప్పి పంపిం చాడు

కాని ఈసారి ఆయనకె ఈ విష యంలో శ్రద్ధ కలిగింది చిన్నప్పట్నుంచీ ఆడవాళ్లనుకుంటుంటే తాను నిర్లక్ష్యం చేశాడు ఇప్పుడింకా ఉపేక్షిస్తే తప్పని సరి కావచ్చునని తెలుసుకున్నాడు అందువల్ల ఈ వ్యవహారాన్ని ఒక కొలిక్కి తీసుకురావాలనుకున్నాడు — వెంటనే

ఒకసారి శేషగిరినే అడిగాడు "లక్ష్మి సంగతి ఏమాలోచించావోయ్" అని

'ఏ లక్ష్మి ?' అన్నాడు శేషగిరి

'అదేనోయ్.. మనలక్ష్మి !'

'బాగుంది మామయ్యా ' మీ అమ్మాయి సంగతి నేనాలోచించట మేమిటి ?' అన్నాడు—ఆడపిల్లల సంగతి ఆలోచించటం తన కలవాటు లేదని చెపు తున్నట్లుగా

'పెళ్ళి విషయమోయ్' అన్నాడాయన క్రీగంట చూస్తూ

'ఏం? కావాలంటుందా?' అన్నాడు శేషగిరి ఎటో చూస్తూ

'మీ అమ్మ తొందరపడుతూంది'

'నీకేం సంబంధం లేదని చెప్పక పోయావు?'

'ఎంతయినా చెల్లెలు గదోయ్? కుండ బ్రద్దలుకొట్టినట్లు ఎలా చెప్పేదీ?'

'పెళ్ళిదగ్గర మొహమాటమా?'

'నీ సంగతి నాకు తెలుసునోయ్ నువ్వు చాలా మంచివాడివి అందుకే నీ సలహా కావాలి'

ఆ మాట లతనికి చక్కిలిగింతలు పెట్టాయి మేనమామదగ్గరగూడా మంచి వాడని పేరు సంపాదించుకున్నందుకు తనను తానే అభినందించుకున్నాడు అంత పెద్దవాడు తన సలహా అడుగుతుంటే కాదనలేకపోయాడు తన సలహా చెప్పాడు – ఎంత కట్నమయినా సరే – అవసరమయితే చాటుగానయినా సరే యిచ్చి–లక్ష్మి కోరినవాణ్ని తెచ్చి పెళ్ళి చెయ్యమన్నాడు

'మీ అమ్మ ఏమన్నా అనుకుంటుం దోయ్'

'ఎందుకు?'

'లక్ష్మిని నీ కివ్వలేదని'

'అలాంటి అనుకోవటాలు నా కిష్టం లేదు అమ్మ సంగతి అనవసరం' అని హామీ ఇచ్చాడు

ఆయన చాలా సంతోషించాడు చాలా పొగిడాడు 'నీలాంటి మంచివాళ్ళు ప్రపంచంలో అరుదోయ్' అన్నాడు 'నీ మనసు చాలా గొప్పదిరా' అన్నాడు 'నీలాంటి వాళ్ళు పదిమంది ఉంటే ప్రపంచాని కిన్ని పాట్లుంటాయా?' అన్నాడు

అంతలోనే లక్ష్మి కాలేజీనుంచి వచ్చింది తండ్రి కూతుర్ని పిలిచి శేషగిరి ఎంత మంచివాడో చెప్పాడు ఎంతో బరువు తొలగిపోయినట్లు నిట్టూర్పు విడిచింది కూతురు – 'హమ్మయ్య' అంది 'నిజంగా నీకు చాలా చాలా Thanks బావా' అని షేక్‌హాండ్ ఇచ్చి వెళ్ళిపో బోయింది వరసయిన పిల్ల చెయ్యి కలిపితే ఊరుకోబుద్ధికాలేదు శేషగిరికి చెయ్యిగిల్లాలనుకుని గిల్లలేక పోయాడు "ఒట్టి థాంక్సేనా?" అన్నాడు "మరింకేం కావాలి?" అంది లక్ష్మి అతనికి చెమటలు పోశాయి ఏమి అడగాలో తెలియక 'మంచినీళ్ళు తెచ్చి పెట్ట'మన్నాడు ఇంట్లోకివెళ్ళి పనిపిల్లతో మంచినీళ్ళు పంపింది లక్ష్మి త్రాగి మేనమామదగ్గర శలవు తీసుకుని వెళ్ళి పోయాడు

జరిగిందంతా విని శేషగిరి తల్లి చిటపటలాడింది పిల్లవాడిలో మెత్తదనాన్ని ఆసరా చేసుకుని మోసం చేశారంది

'ఎవర్నో ప్రేమించినదాన్ని నే నెలా చేసుకునేది?' అన్నాడు శేషగిరి

'ఎవర్నయినా ప్రేమించిందని చెప్పారా నీతో?'

'అలా అని చెప్పలేదు...కాని వాళ్ల మాటల్ని బట్టి అలా అనిపించింది '

'అంతా వట్టిది లక్ష్మి ఎవర్నీ ప్రేమించలేదు వాళ్ళ నాన్న ఎవర్ని చేస్తే వాణ్ని కట్టుకుంటుంది ఎవరి కెక్కువ ఆస్తి ఉంటే, వాళ్లని ఒప్పించి తెస్తాడు. నీచేత ఒప్పించటాని కిదొక పన్నాగం' అంది

కాని శేషగిరి అవన్నీ నమ్మలేదు ఇతరులని శంకించటం మంచిది కాదను కున్నాడు

వాళ్లతో ఇక మాటాడవద్దంది తల్లి

కాని శేషగిరి వాళ్లకి పెళ్లిపనులు చేసిపెట్టాడు ఇంటి బిడ్డలాగా పనులు చేయించాడు 'లక్ష్మిని నీ కిస్తారను కున్నారుగవోయ్ ?' అన్నాడు పెళ్లి కొచ్చిన ఒక చిన్న మనిషి శేషగిరి ఛాతీ అంగుళం పెరిగింది తన మంచి తనం తన కళ్లకి కట్టినట్లు కనిపిస్తూంది 'నేనలాంటి వాటి కతీతుణ్ని' అన్నాడు.

ఆ పెళ్లి అయింతరువాత తానేదో ఘనకార్యం చేసినట్లు సంతోషించాడు పెళ్లి పందిట్లో ఉన్న వాళ్లందర్నీ మరిచి పోయాడు రఘు మహారాజు, బుద్ధభగ వానుడు, గాంధీ మహాత్ముడు కళ్ల ముందు చిరునవ్వుతో కనుపించారు

అవంతా అయింతరువాత తనపెళ్లి సమస్య అలాగే మిగిలిపోయినట్లు గుర్తు వచ్చింది ఎవరయినా మంచి పిల్లని ప్రేమించి పెళ్లిచేసుకోవాలనుకున్నాడు

ఆనాడు ఆఫీసులో జానకి పార్టీ యిచ్చింది ఆమె కైపిష్టు మొదటి ఇంక్రిమెంటు వచ్చిందట అందుకని పార్టీ ఇచ్చింది జానకిని గురించి ఆలో చించాడు ఆమె చాలా మంచిదిగా కను పించింది మరునాడు తనకు తెలియ కుండానే సిల్కు పాంటు, సిల్కు షర్టు వేసుకున్నాడు అనుకోకుండా క్రొత్త బూట్లు కొన్నాడు కాని ఆఫీసుకి జానకి రాలేదు ఆనాడు తనకు చాలా నిరుత్సా హం కలిగింది తనకీ నిరుత్సాహం ఎందుకు కలగాలి ? అని ప్రశ్నించు కున్నాడు అలా ఆత్మ విమర్శ చేసు కోవటం అతని కలవాటు శేషగిరి అంత మంచివాడు కావటానికి అదే కారణం జానకి రాకపోతే తన కెందుకు నిరుత్సా హం కలగాలి ? తాను ఆఫీసు కొచ్చేది, జానకి కోసమా ? కాదు ఇంతకు ముందు చాలా సార్లు జానకి శలవు పెట్టింది అప్పుడు తనలో ఏం చలనం కలగలేదు ఇవాళ మాత్రం ఎందుకు మార్పు రావాలి ? తాను జానకిని ప్రేమిస్తు న్నాడా ? ప్రేమించటంలో తప్పులేదు కాని జానకి తనను గురించి ఏమను కుంటుందో తనకు తెలియదు అందువల్ల తాను జానకిని ప్రేమిస్తున్నట్లు ఒప్పుకో లేకపోయాడు

ఆఫీసులోకి క్రొత్తగా చేరాడు రఘు. అతడెప్పుడూ ఏదో ఒకటి మాటాడు తూనే ఉంటాడు అలా మాటాడుతుంటే



పోలికలు

గాని పని త్వరగా సాగదని చెపుతాడు పైగా ఆడవాళ్ల నెప్పుడూ విమర్శిస్తూనే ఉంటాడు

'ఆడపిల్లలకి చదువు దండగ' అన్నా డొకనాడు అది విని జానకి శేషగిరి వైపు చూచింది శేషగిరి సహించలేక పోయాడు

'కాదు చదువు అందరికీ కావల సిందే దానికి ఆడ, మగ భేదాలు లేవు' అన్నాడు

'ఆడవాళ్లకి చదివినా ఏమీ రాదు' అన్నాడు రఘు

'వాళ్ల నసలు చదవనియ్యరు మగ వాళ్లు' అన్నాడు శేషగిరి

'చదవనివ్వకపోతే దేశం చాలా బాగుపడి ఉండేది చదవనిస్తున్నారు గనుకనే ఇన్ని చిక్కులు' అన్నాడు రఘు

'స్త్రీ విద్య అవసరం' అని గట్టిగా వాదించాడు శేషగిరి 'అనవసరం' అన్నాడు రఘు అదే వాదన అందుకు కారణం జానకి కాని జానకి మాటాడదు

'ఆడవాళ్లకి ఉద్యోగా లివ్వటం దండగ' అన్నాడు రఘు

'ఏం దండగా?' అన్నాడు శేషగిరి

'సంవత్సరానికి మూణ్నెల్లు మెట ర్నటీ లీవు దండగకాక మరేమిటీ?'

జానకి ఫైలులో ముఖం దాచుకుని నవ్వింది

'ప్రకృతి స్త్రీలకు చాలా అన్యాయం చేసింది .. ప్రభుత్వంకూడా అన్యాయం చేస్తే ఎలా? అన్నాడు శేషగిరి

'పోనీ పాపం! తమరుగూడా కొంత తీసుకోరాదూ ఆ బాధ్యత?' అన్నాడు రఘు

జానకి ఫైలులోనుంచి ముఖం తీయ లేదు తాను స్త్రీలతరపున వాదిస్తున్నాడు

గనక జానకికి తనమీద సదభిప్రాయం ఉండాలనే అనుకున్నాడు.

'కాకపోయినా ఆడవాళ్ళమీద ఈగ వాలనీయనంటా వేమిటి నువ్వు ?' రఘు మరోసారి

'అవును స్త్రీలంటే నాకు పూజ్య భావం ఉంది '

'అసలు నీకు భావాలు పూజ్యం' అన్నాడు రఘు ఫక్కున నవ్వింది జానకి శేషగిరి తల దించుకున్నాడు.

శేషగిరిని ఆనాడు తమ యింటికి రావలసిందిగా కోరింది జానకి

'ఎందుకు ?' అన్నాడు శేషగిరి

'మా చెల్లెలి పుట్టినరోజు పండుగ '

'మరి .మరి .మనవాళ్ళంతా వస్తున్నారా ?'

'లేదండీ ' అందర్నీ పిలవదల్చుకో లేదు '

శేషగిరిలో ఒకవిధమైన సంతృప్తి వెలిసింది జానకి దృష్టిలో తన కొక ప్రత్యేకత ఉన్నదని తెలిసి సంతోషించాడు

జానకి చెల్లెలి కేదయినా ప్రెజెంటేషన్ తీసుకుపోవా లనుకున్నాడు కాని చెల్లెలంటే ఎంతఉందో ఏమీ తెలుసుకో లేదు తాను జానకి వెళ్ళిపోయింది తరువాత ఇవ్వవచ్చునులెమ్మని రిక్త హస్తాలతోనే వెళ్ళాడు-చేతులు జేబుల్లో పెట్టుకుని

జానకి స్వయంగా టిఫిను తెచ్చి యిచ్చింది తిన్నతరువాత టీ తెచ్చి యిచ్చింది అతడది త్రాగుతుండగా 'మీ కొక ఆహ్వానం' అని ఒక కవరు అందించింది అందుకుని 'ఏమిటిది ?' అన్నాడు శేషగిరి 'చూడండి' అంది జానకి

శేషగిరి చూచాడు చూచి ఉలిక్కి పడ్డాడు జానకివంక, కార్డువంక ఎగా దిగా చూచాడు జానకి నవ్వుతూ అలానే నిల్చుని ఉంది కప్పు అవతలపెట్టి జేబు రుమాలుతో ముఖం తుడుచుకున్నాడు శేషగిరి

'ఏమిటి జానకిగారూ ! మీరు రఘుని చేసుకుంటున్నారా ? '

'కాదండీ ఆయనే '

'మీ రెలా ఒప్పుకున్నారండీ ' అతని సంగతి తెలిసిగూడా ?'

'తెలుసు గనుకనే ఒప్పుకొన్నాను తెలియని వాళ్ళ నెలా చేసుకుంటాం చెప్పండి '

'కాని రఘు ' అతని భావా లెలాంటివో మీకు ?'

నవ్వింది జానకి పెద్దగా

'ఆడవాళ్ళకి చదువులు, ఉద్యోగాలూ ఏమీ అక్కరలేదంటాడు వాళ్ళని పిల్లలుకనే యంత్రాలుగానూ, వంట యింటి కుందేళ్ళుగానూ ఉండమంటాడు అలాంటివాడిని ' అని ఆవేశంతో చెప్పుకుపోతున్నాడు

'అవునండోయ్ .మీకు చెప్పనే లేదు నేను ఉద్యోగానికి రాజీనామా

యిచ్చేశాను ' శేషగిరి ప్రపంచం గిర్రున తిరిగి తలక్రిందులుగా నిలబడింది జానకి తనను మోసం చేసిందనిపించింది ఇక నక్కడ నిలవబుద్ధి గాలేదు గబగబా బయటికొచ్చాడు వెనకాల జానకి నవ్వు తున్నట్లనిపించింది చాలా ప్రశ్నలు కుక్కగొడుగుల్లా పుడుతున్నయ్ ప్రేమ ఏమిటి ? ఆడవాళ్ల కేం కావాలి ? వాళ్లకి స్వేచ్ఛ అంటే ఇష్టం ఉండ దెందుకని ? ఎలాంటి మగవాడయితే ఆకర్షించగలుగుతాడు ? వాళ్లకి దాస్యం చెయ్యాలనే ఉంటుందా? కోరికలుండవా? అంతా అగమ్యగోచరంగా ఉంది

ఆ రోజు రానే వచ్చింది ఆనాడే రఘుకీ జానకికీ పెళ్లి తను వెళ్లాలా ? వద్దా ? అని సందేహం – డెన్మార్కు యువరాజులాగా, కాని వెళ్లకపోతే వాళ్లే మనుకుంటారు ? తనను అసూయాపరు డని అనుకోరూ ? తాను అసూయా పరుడా ? వాళ్లిద్దరూ పెళ్లి చేసుకుంటే తనకొచ్చిన నష్టమేమిటి ? తానెందుకు సంతోషించలేదు ? ఇద్దరూ తనకు తెలిసిన వారే ! తనతో కలిసి పనిచేసిన వారే ! తానెందుకు సంతోషించగూడదు ? పెళ్లి కయినా వెళ్లటం తన బాధ్యత గాదూ ? వెళ్లకపోతే తనది అసూయ గాదా ? అలాంటి నీచభావం తనలో ఉందా ? లక్ష్మి పెళ్లి తన చేతులతో చెయ్యలేదా ? జానకి పెళ్లికి వెళ్లవలసిందే ననుకున్నాడు. ఖరీదయిన ప్రెజెంటేషన్‌లు కొన్నాడు. పెళ్లిలో పూసుకుతిరిగాడు తీరికలేకుండా పనిచేశాడు ఇద్దరికీ ప్రంజెంటేషన్లతో పాటు శుభాకాంక్షలుగూడా అందజేశాడు 'ఇక వస్తా' నని ఇద్దరి దగ్గరా శలవు తీసుకుని బయలుదేశాడు..

'పాపం' చాలా మంచివాడండీ !' అని వెనక ఎవరో ఎవరితోనో చెపు తున్నట్లు వినిపించింది శేషగిరికి కోరిన బహుమానం లభించినట్లయింది ★

---

**కృత నిశ్చయం కావాలి**
**పట్టుదలగా పనిచేయండి**
**జాతీయ రక్షణ కృషిలో పాల్గొనండి.**

---

# ప్రశ్నావేదిక

ఎస్. కె. రాజామణి, పలమనేరు

**జీవితం అంటే ఏమిటండీ ?**

ఈ ప్రపంచం పుట్టినప్పట్నుంచీ ఈ ప్రశ్నపై వేలాది విధాలుగా తర్జన భర్జనలు జరుగుతూనే వున్నాయి, రకరకాల సమాధానాలు పుంఖాను పుంఖాలుగా వస్తూనే వున్నాయి ప్రపంచంలో పుట్టిన అన్ని మతాలూ, అందరు ప్రవక్తలూ, మహాత్ములు కూడా 'జీవితా'న్ని నిర్వచించ డానికే అహరహం కృషిచేయడం, చేస్తూండడం జగద్విదితం సదా లక్ష సమాధానాలు ప్రచారంలోకి వచ్చినా 'జీవితం అంటే ఇదీ' అని సూక్ష్మంగా అర్థంచెప్పేది కనిపించడంలేదు

వేదాంతులు "జీవితం మిథ్య, అనశ్వరం, బుద్బుదప్రాయం, పూర్వ కర్మ ప్రారబ్ధం, ముందుజన్మకు పునాది, ముక్తికి మెట్టు, భగవత్సేవకు జీవికి లభించిన శారీరక ప్రహేళిక, సృష్టికర్త జీవితో ఆడుకునే బొమ్మ లాట, ఆది మధ్యాంత రహితుడైన వాడు ఆది మధ్యాంతాల హేలను ప్రదర్శించేందుకు ప్రవేశపెడుతున్న రంగస్థల పాత్ర, భగవద్దత్తం భగవ చ్చోదితం భగవత్సంలీనకం-" అంటారు

భౌతిక రాజకీయవాద పారంగతులు "ఏదైనా మిథ్య కావచ్చుగాని జీవితంమాత్రం సత్యం భౌతిక వారసత్వ కారణాలుగా లభించిన ఈ జీవితం, పరిసర ప్రభావితంగా మెలగినా - హేతువాద బద్ధంగా నడుపు కోవలసిన ఆదర్శం వంటిది హేతువిచక్షణా పూర్వకంగా నడిచే జీవితమే అసలు మానవ జీవితం, తతిమ్మా రకాల జీవితాలన్నీ కృత్రిమాలు అన్ని రంగాలలో సమానావకాశాలుండి, తిండి బట్ట వసతి విద్య మొదలైన కనీసావసరాలకు ఎన్నడూ ఎవరికీ లోటులేకుండా వుండి,

శాయశక్తులా కృషిచేసి కావలసినంత అనుభవిస్తూండే సమాజంలో బ్రతకడం, అలాంటి సమాజ సృష్టికి పరిరక్షణకు కృషి చేయడం - ఇదే పరిపూర్ణ జీవితం" అంటున్నారు

మేథావులు కొందరు "మనసా వాచా కర్మేణా మంచినే చేస్తూ, చెడు తలంపైనా రానీక, తానానందిస్తూ సమాజానందాన్ని పంచుకునే వారిదే జీవితం'' అన్నారు.

''సకలోచ్ఛ నీచాలూ, వెలుగు చీకట్లూ, సుఖ దుఃఖాలూ, మంచి చెడులూ, సుఖ భోగ నిష్పచ్ఛరాలూ కలిసి కోట్లాది మానవులకూ ఒక్కొక్కరికొక్కొక్క విధంగా గడిచే ఈ మహా వైవిధ్య శోభే జీవితం'' అనిపిస్తుంది యథాస్థితిని కొనసాగించాలనే అభ్యుదయ నిరోధకులుండరు ఉంటే, వారు కాలగమనానికి చింకిచేటలు ఎదురడ్డే వెంగలులు కాకపోరు సమాజ సుఖశాంతులకు ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగాగాని ఏ హానీ మాత్రమూ హేతుభూతంకాకుండా — సాధ్యమైనంత ఎక్కువ సుఖాన్ని, అంతకంటె ఎక్కువ సంతోషాన్నిపొందగల మానవుని బ్రతుకే 'జీవితం'

*జి వి రామారావు, కందుకూరు*

**జాతీయ కవికి, ఆస్థాన కవికిగల భేద మెట్టిది ?**

పూర్వం ఒక కవిని ఏ భాగ్యవంతుడో, ఏ బుల్లి జమీందారో అభిమానించి పోషించితే ఆ కవిని ఆస్థానకవి అనేవారు ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వం ఎంచుకుని ప్రకటించిన కవిని 'ఆస్థానకవి' అంటున్నాం. ఈ దృష్ట్యా కేంద్ర ప్రభుత్వం ఎంచుకుని, ప్రకటించిన కవిని 'జాతీయ కవి' అనవలసి వుంటుంది కాని మన భారత ప్రభుత్వం ఇంతవరకు అలాంటి పని చేయలేదు

**తెలుగు దేశం గుర్తించిన జాతీయ కవి ఎవరు ?**

'తెలుగు దేశం' అంటే 'తెలుగు వారు' అని మీ వుద్దేశం కావచ్చు. మనకు మనంగా ఒకరిని ఆస్థాన కవిగా గుర్తించటానికే ఏకాభి

ప్రాయానికి రాలేని 'విలక్షణ' జాతి మనది ఈ 'విలక్షణ' మే 'విశిష్టత అనే వాళ్ళు కూడా మనలో చాలామంది వున్నారు కీర్తిశేషులైన 'గురజాడ' వంటి వారి ప్రతిభను గుర్తించేందుకూడా నసిగే పండితమ్మన్యులున్న మన తెలుగువారు — ఏకవినైనా బ్రదికి వుండగానే 'ఆస్థాన కవి'గా ఏక కంఠంతో శ్లాఘించుకొనే అవకాశం కల్పించుకోరు అనుకుంటాను ఇక 'జాతీయకవి' సంగతెందుకు !!

*కె వి సావిత్రీరెడ్డి, హైద్రాబాద్*

**అందానికీ, ఆనందానికీ అనుకూల వాతావరణం ఏమిటంటారు ?**

అందానికి - గుర్తింపు, మెచ్చుకోలు, సద్వినియోగం, ఆరాధన లభించే చోటే అనుకూలం ఆనందానికి - స్వానుభూతి, పరానుభూతి కూడా కలసి మరపురాని శాంతి క్షణాల్ని కాంతివంతం చేసే సందర్భం హృదయాలూ తగినచోట్లు

*ఎం. ఆర్ ఆచార్య, హిమాయత్ నగర్ (?) — ఎం. ఆర్ ఆచార్యు, హైదర్ గూడా*

**నిప్పు ముట్టుకుంటే కాలుతుంది మరి, తెలిసికూడా ఎందుకు చెయ్యి కాల్చుకుంటారు ?**

నిప్పును తాకితే కాలుతుందని తెలిసిన వాళ్ళు సామాన్యంగా ముట్టుకోరు తెగించరు పసి హృదయాలు పెద్దలు చెప్పినా, అదెంతవరకూ నిజమో తెలుసుకుందా మనో, పొరపాటునో నిప్పును తాకుతారు నిప్పు అందర్నీ కాలుస్తుంది, నన్నెంతవరకు కాల్చుతుందో చూద్దామనో నన్నంత ఎక్కువ కాల్చలేదని నిరూపిద్దామనో, కాలేప్పుడు అనుభూతు లెలావుంటాయో తెలుసుకుందామనో సాహసించేవాళ్ళు కొద్దిమంది వుంటారు ఈ సాహసికుల వల్లనే పదార్థ విజ్ఞాన శాస్త్రీయ పరిశోధనలూ, ప్రగతీ సాధ్యమవుతున్నాయి





# యువతీలోకం



## జల్సాగా - జాలీగా

ఈనాటి యువతుల్ని పరిశీలిస్తే అమాయకతవల్ల ఆడంబరాలకు పోయి, బోర్లపడేవారు ఎక్కువగా వున్నారనిపిస్తున్నది. మళ్ళీ 'అమాయకురాలు' అంటే మాత్రం ఏ ఒక్కరూ సహించలేరు; అదేదో నిందావాక్యం అనుకుని — తోక తొక్కబడిన తాచుల్లా బుస్సున లేచి కస్సు మంటారు. ఈ అకారణ క్రోధ లక్షణాన్ని బట్టే వాళ్ళు అమాయకులని తెలుతుంది గదా!

మొన్న సంక్రాంతికి మా హాస్టల్‌లోని యువతులం ఎటైనా పిక్నిక్‌కు వెడదామనుకున్నాం. భోగిపండుగనాడు ఉదయం పలహారాలు చేసేప్పుడే ఈ ప్రసక్తి వచ్చింది. డైనింగ్ టేబుల్స్ చుట్టూ ఏభై, అరవై మందిమి వున్నాం. 'ఇవ్వాళా రేపూ సెలవలే గదా, ఎటైనా పిక్నిక్‌కు పోయి జల్సాగా (జాలీగా కాదు!) గడిపితే బాగుండును' అంది మా రూం మేట్ నళిని.

ఆ ప్రసక్తి వినగానే ఇరవై, ముప్పయి మంది 'వెరీ గుడ్; గుడ్ ఐడియా' అంటూ హాలు ఎగిరిపోయేంతగా హర్షధ్వానాలు చేశారు. నేను "మొన్నేగా ఇళ్ళకు వెళ్ళివచ్చాం. ఇంతలోనే మళ్ళీ జల్సా లెందుకు లెద్దురూ?" అన్నాను — పిక్నిక్‌కు అయ్యే అదనపు ఖర్చుల సంగతి తలచుకుని. నా రూం మేట్స్‌లో మూడవ యువతి మేరీ ఎగతాళిగా నవ్వుతూ, "జల్సాలక్కూడా పిరియడ్సూ, టెరమ్సూ ఏమిటోయ్? కోరినప్పుడల్లా మజామజాగా తిరగాలిగాని, అన్నిటికీ లెఖ్క వేసుకునే జీవితం ఏం జీవితం...ఛి ఛీ" అనేసింది. చాలా మంది మేరీ మాటల్ని సమర్థిస్తున్నట్టు చప్పట్లు చరిచారు.

ఒకరిద్దరు "యూనివర్సిటీ గరల్స్‌లో కూడా యింతటి ముసలమ్మలూ, పైస పైసకీ లెఖ్కేసే వాళ్లూ వుంటారనుకోం" అన్న ధోరణిలో నన్ను ఈసడించుకుంటున్నారు. నేను "అన్ని రకాల పిండివంటలూ ఇక్కడే చేయించుకుంటున్నాం. అందరం ఇక్కడే ఆటలవీ ఆడుకుందాం. మరెక్కడికో వెళ్ళాలంటే వేన్ (Van)కూ వాటికీ చాలా ఖర్చవుతుంది గదా" అన్నాను.

మేరీ "అదుగదుగో, మళ్ళీ వెధవ

శారద, ఎం. ఏ.

డబ్బుల గొడవేనా డియర్। ఎప్పుడూ హాస్టల్లో మగ్గేవాళ్ళమేగా — రొంత్రోజు లన్నా మగాళ్ళలా తిరిగొద్దాం ఓపెన్ ఎయిర్‌లో ఇక నసక్క లే!!" అని నా చెయ్యి పట్టుకు లేపింది సళిని "ఇట్లాటి వాళ్ళుండబట్టే మహిళల బతుకు లిట్లా మట్టిగొట్టుకు పోతున్నాయ్ అందుకే మగవాళ్ళెప్పుడూ మనల్ని వంటింటో బానిసల్నిగానే చూస్తున్నారు' అంది ఆవే శంగా మరో క్లాస్ మేట్ జానకి "వాళ్ళవ కాశా లిచ్చినా మనం ఉపయోగించుకో లేక, ఈ బంగారపప్పంజరాలే కావాలం టుంటే—ఇక మగవాళ్ళ తప్పేం వుందిలే" అంది

అంతలోనే మరో పక్కనుంచి పారి జాతం అనే సీనియర్ క్లాస్ అమ్మాయి, "ప్రతిదానికీ ఇంత ముసల్దానిలా అడ్డు చెప్పేదని తెలిస్తే—మొన్న మః లీడర్‌గా ఎన్నుకునే వాళ్ళమేకాదూ'' అని తుస్సుగా పలికింది వాళ్ళ మాటలు వింటే నాకు కంపరం పుట్టుకొచ్చింది 'ఇలాంటి వాళ్ళని తెలిస్తే నే నసలు లీడర్‌గా వుండ డానికే ఒప్పుకునే దాన్నికా' దని అందా మనిపించింది పోన్లే వాళ్ళలా నేనూ చులకనగా అలగకూడదని ఊరు కున్నాను పైకి "మీరంతా కావాలంటే నా దేం పోయిందీ?। వెళ్ళండి—వార్డెన్‌తో చెప్పి పర్మిషన్ ఇప్పిస్తాను'' అన్నాను

అందరూ ఎంతో సంబరపడ్డారు నేను వెళ్ళి మా వార్డెన్‌తో చెప్పి ఒప్పించాను ఒక మోటార్ వేన్ కూడా ఏర్పాటు చేయించాను—రోజుకు 50 రూపాయలు, పెట్రోలు, డ్రయివర్ మామూళ్ళు యిచ్చే షరతుల మీద మరో గంటకు భోజన పలహార సామగ్రులు డేక్చాలలో పెట్టు కుని ఇరవై, పాతిక మంది యువతులు వేన్‌లో ఎక్కి కళకళలాడుతూ వెళ్ళి పోయారు వాళ్ళ సంతోషం చూస్తే నాకూ వెళ్ళాలనిపించింది కాని—ఆర్థిక దృష్ట్యా ఆగిపోయాను

అలా వెళ్ళిన వాళ్ళు పండగ నాటి రాత్రికి తిరిగి వచ్చారు ఒకరిద్దరు తప్ప తతిమా వాళ్ళ మోహాలన్నీ వెలుగులో నుంచి చీకటి బుయ్యారంలోకి వచ్చిన ఖైదీల మొహాల్లా వున్నాయి 'ఏమిటి సంగతని ఒక్కొక్కర్నే కదిపి చూచాను అంతా పిక్నిక్ బ్రహ్మాండంగా, జల్సా జల్సాగా జరిగిందనే చెప్పారు గాని— వాళ్ళ మొహాల్లో తారట్లాడుతున్న మ్లాన భావాలకు అర్థం తెలవలేదు పూర్తిగా సంతోషిస్తున్న ఒకరిద్దరూ పెట్టి పుట్టిన వాళ్ళు

మరో గంటకు అందరూ స్నానాలు చేసి డైనింగ్ హాలుకు బయలు దేరారు నా రూం మేట్స్ ముస్తాబవడం కొంచెం ఆలస్యమై మేం వెళ్ళేసరికి డైనింగ్ హాల్ యువతులతోనిండి వుండి కూడా నిశ్శబ్దంగా, బిక్కుబిక్కు మంటున్నది "ఏ టో ఇంత విచారాని క్కారణం?' అనిపించింది ఇంతలో మోటార్ వేన్

# ఒంటరి ప్రయాణం

*

మద్దాళి బాల

అనసూయ ఒస్తున్నదంటే నా మనసు యెందుకో ఉత్సాహంతో ఉరకలు వేయసాగింది. ఒక ప్రక్క సంతోషం, మరొక ప్రక్క నిరుత్సాహం కలవర పెట్టాయి. ఇన్ని యేళ్ళ తర్వాత చూస్తాననే సంతోషం, యిప్పు డెలావుందో అని నిరుత్సాహం. అయినా యెంత కాలం గడిచింది! మేము కాలేజీలో చదువుకుంటున్న రోజులు. అనసూయ, నేనూ ఒకే క్లాసులో ఉండేవాళ్ళం. నాకు ఆమెను తెలుసు – బాగా తెలుసు అనవచ్చు. యెందు చేతంటే మేమిద్దరం ఒకే 'పేట' నుంచి కాలేజీకి వెడుతుండేవాళ్ళం. కాలేజీ మా యిళ్ళకు నాలుగు ఫర్లాంగుల్లో వుంటూండేది. నేను బయలు దేరిన అయిదారు నిమిషాలకు యెదురుగా గాజులు చప్పుడు వినిపించేది. తలయెత్తి చూస్తే అనసూయ కనిపించేది. క్లాసులో పేర్లు పిలిచినప్పుడు తెలుసు కున్నాను ఆపేరు యెవరిదో. కాని ఆమెతో మాట్లాడే అవకాశం కలగలేదు మొదట్లో. ఆవిడతో పరిచయం కలుగుతుందని కల్లో కూడా అనుకోలేదు.

ఒక రోజు కాలేజీకి వెడుతున్నాను. వెనుక నుంచి యెవరో నన్ను పిలిచినట్లయింది. 'యెవరూ' అని పరధ్యానంగా వెనక్కు తిరిగాను. 'నేనే' అంది అనసూయ. పూవులోంచి వచ్చే పరిమళంలాగా మధురంగా వున్నాయి ఆమాటలు. అర్ధనిమీలితమైన కళ్ళతో, దీనంగా అడుగులో అడుగులు వేసుకుంటూ కనిపించింది. 'నమ్మలేని కళ్ళను సమాధాన పరచుకుంటూ, ఉప్పెనలా వచ్చే గగుర్పాటును అణచుకుంటూ 'మీరా' అన్నాను.

"మీ గడియారంలో టైము యెంతో చెప్పండి"

"యేం అంత తొందర ?"

"తొందరే"

"యేమంత మించిపోలేదు. పది గంటలే. ఇంకా ఓ అరగంట వుందిగా. ఇంకొక అయిదు నిమిషాల్లో కాలేజీకి వెళ్ళక పోతామా..."

"మిమ్మల్ని ఆడిగినందుకు యేమీ అనుకోకండి. టైము అవుతోంది" అని త్వరగా నడిచింది. ఈ అమ్మాయికి యింత భయం యెందుకా అనుకున్నాను.

నేను కాలేజీకి. చేరేప్పటికి అరగంట ఆలస్య మయింది. క్లాసులోకి వెళ్ళు తుంటే అంతా గొల్లుమన్నారు. ఇదేమిటి చెప్మా అని పరీక్షగా గడియారాన్ని చూతునుగదా, అది రాత్రి పదిగంటకే ఆగిపోయి వుంటుందని నిర్ధారణకు రావలసి వచ్చింది. అప్పుడు అర్ధ మయింది ప్రొద్దున అనసూయ పడిన అలజడి. ఆమె సద్గుణ ఖని — దానికి సందేహంలేదు — అనుకున్నా అప్పుడు. కాని ఆమెకు ఆహ్వానం చెప్పటానికి ఈ రోజు స్టేషనుకు వెళుతున్నప్పుడు నా అభిప్రాయాలు — ఆమె మంచిని గురించి — యెంతవరకు సమంజసమో సరిగా నాకు తెలియదు. ఇంతకూ జరిగిందేమిటంటే ఆమె ఒక సాహసకార్యం చేసింది. నాకు తెలుసు రామానుజాన్ని. తలుచుకుంటే ప్రత్యక్ష మయినట్టు కన్పింస్తూంటాడు. పొట్టిగా లావుగా వుండేవాడు. కొంచెం మెరుస్తున్న నుదురు, దానిక్రింద కూచిగా వంగినముక్కు, యెప్పుడూ పదునుపెట్టి మెరుస్తూవుండే సానలాంటి గడ్డం, కొంగరెక్కలా తెల్లటి షర్టు మీద కొంచెం మాసికపట్టిన కోటు, యేదో ఒక రంగుది పాంటు — ఈయన ఆభరణాలు. ఇతనికీ, అనసూయకూ యెలా స్నేహం కుదిరిందో తెలియదు. తెలుసు కుందామని నాకు కుతూహలంగా వుండేది, అనసూయ రామానుజంతో అంతర్ధాన మయిందని తెలిసిం తర్వాత, ఈ సంఘటన నన్ను యెన్నో విధాల కలవరపెట్టింది. జీవితపు విలువలేమిటో నాకు అర్థంకాలేదు. ఏది మేలిమి బంగారమని నేను నమ్మానో అది కాకి బంగారమయి కూచుంది. నాలుగు దశా బ్దాలు నిండిన వీడికి యీ పొయ్యేకాలం యేమిటని కోపంవచ్చింది రామానుజం మీద. ఒక రింటికి చిచ్చుపెట్టి తమాషా చూడ్డం కొందరికి ఆనందం కాబోలు. మొహంమీద నవ్వు, లోపల విషం వుంటాయి కాబోలు కొందరు మను షుల్లో. అయినా యెంత తెగించారు వీళ్ళు — యిలా అను కుంటుండగానే హైరోడ్డుదాటి రైలుస్టేషనుకు ఓ ఫర్లాం గులో వుంది నేను యెక్కిన రిక్షా. గడియారం చూస్తే యింకా యిరవై నిమిషాలుంది రైలు రావటానికి. మెల్లగా రిక్షాదిగి స్టేషను ఆవరణలోకి ప్రవే శించాను. పిల్లల యేడుపుల్తో, పెద్దవాళ్ళ అరుపులూ, ఊరడింపులతో సందడిగా వుంది అక్కడ. ప్లాటుఫారం మీద ఒక మూల కూర్చుని, వచ్చే బండికొరకు వేచి వుందాం — అను కున్నాను. కాని అన్ని సీట్లలో మనుషులు కూచొని వున్నారు. నేరుగా వెయిటింగు రూము కేసి నడిచాను. "యేం బ్రదర్ ... ఇంత ఆలస్యంగా వచ్చారేమిటి ?" అన్న గొంతు వినిపించింది, ఒక మూలనుంచి. ఆ వైపుకు నా చూపులు ప్రసరించాయి. 'పెంగ్విను' నవల వెనుక అస్పష్టంగా

ముఖం కనిపించింది. ఎవరా అని దగ్గరకు వెళ్ళాను. "నేనేనోయి" అన్నాడు బ్రహ్మానందం, నవలను మడిచిపెడుతూ. అతను రావడం నాకు ధైర్యాన్నిచ్చింది. సగంబరువు నా మీదినుంచి తీసిపెట్టినట్లయింది. నేను "నువ్వు వచ్చావు. నాకు సంతోషం" అన్నాను.

"సంతోషంగా వుందంటావు నీ ముఖం చూస్తే మూడు రాత్రులు మారతాన్‌గా యేడ్చినట్టుంది ... అతిథి వొస్తున్నారనైనా అక్కర్లేదూ?అందులో లేడీగెస్టు? ఆమజ్నూ పోజు కాస్త మార్చు బాబూ" అన్నాడు బ్రహ్మానందం. అలా మాట్లాడటం అతనికి వెన్నతో పెట్టినది.

"ఊరికే యేదో వాగక కార్యక్రమ మేంటో చెప్పు" అన్నాను.

"కోప మొచ్చిందా తండ్రీ ... అదిగో నువ్వూ, నేను, సంయుక్త కార్యదర్శులం ఉన్నాం కదా! విగతావారు యీ పాటికి సగందారిలో వుంటారు."

"మరి అసలుసంగతి మరిచావా ?"

"యేమిటీ ... ఆవిడకు వసతి గురించా...నీవు వుండనే వున్నావుగా, ఆమెకు తెలిసినవాళ్ళు యెవ్వరూ లేరు యీ ఊళ్ళో, నీవు తప్ప"

"పూలమాల సంగతి,"

"అదా. అదుగో ఆ కిటికీలో. అంతా సిద్ధంగానే వున్నది. నీవు ధైర్యంగా వుండు విక్రమా "

"మన ఊరికి వచ్చిన వాళ్ళని గౌరవించడం మనల్ని గౌరవించుకోవడమే కదూ. అందుకని అలా అడిగాను."

క్షణంసేపు నేను ఆలోచనలో పడ్డాను, అనసూయ 'యెంతవరకు మేము యిస్తున్న గౌరవానికి పాత్రురాలో నాకు అర్థం కాలేదు. ఇప్పుడు ఓ ప్రొఫెసరు కావచ్చు, పేరు ప్రతిష్టలు సంపాదించుకొని ఉండవచ్చు చిన్నప్పుడు యెవ్వరికీ చెప్పకుండా రాత్రికి రాత్రి దేశంమీద పోయిన అమ్మాయేకదా ? అది యెలా మరువగలను ! ఈ విషయం బ్రహ్మానందంగారికి తెలిసి పోతుందేమో నని నాకు ఎందుకో భయంవేసింది. కొంచెం ఆలోచిస్తే ఆ భయానికి కారణం తేలిగ్గా తెలిసిపోయింది. అతను వట్టి మాటకారి. యేదైనా విషయం తెలిస్తే నలుగురి చెవుల్లో పడేసిందాకా నిద్రపోడు. నేనే సాహసించి, "అబ్బాయి; యిది పరిస్థితి. జాగ్రత్తగా మసులుకో, యీ సంగతి యెక్కడా పొక్కొద్దుసుమా" అని ముందే చెప్తే యెలా వుంటుందని ఆలోచించాను. అదేంబాగాలే దనిపించింది. అతని మీద నమ్మకం ముంచటానికి, కొరివితో తలగోక్కోటానికి అట్టే భేదం లేదేమో – అనుకున్నాను.

"హలో...యేమిటోయి ఆలోచన'' అని బ్రహ్మానందం అనేటప్పటికి గుండె కలుక్కు మంది.

"ఆలోచన లేదు...యేమీ లేదు"

"నాకు తెలీదను కున్నావా మన చీఫ్

గెస్టు సంగతీ? యింతకూ ఈవిడ చీఫ్‌గెస్టు కాదు కదా...అయినా మనలో మన మాట...యేమంటావు?"

బ్రహ్మానందం అన్న ఈ మాటతో నాలోవుంటున్న కొస్త ధైర్యం కూడా మాయమైంది. యిక గత్యంతరము లేక అన్నాను, "అలా మాట్టాడ్డం నీకు న్యాయంకాదు. మన అందరం తప్పులు చేస్తూవుంటాం. నిజమేమిటో తెలీనంత వరకు మనము అనుకుంటున్న దంతా ఊహాగానమే..."

"అయితే అనసూయ విషయంలో జరిగిందంతా కలేనంటావా...''

"నేనలా అనను...అయితే నాకు ఒక్కటే తోస్తున్నది. జరిగిందేమిటో ఆవిడనే అడిగి కనుక్కుందాం. నువ్వు నాతోవుండు, అభ్యంతరము లేక పోతే..."

"నువ్వు అన్నది నిజమే బ్రదర్..."

నేను అందుకున్నాను; "యిప్పుడు ఈ విషయం లేవదీస్తే మనము సాయంత్రానికి యేర్పాటుచేసిన కార్యక్రమమంతా భగ్నమౌతుంది. అందరం అల్లరిపాలవుతాం — యేమంటావు బ్రహ్మనందం..."

''ఒప్పుకున్నాను తండ్రీ, భయపడకు...అదిగో సిగ్నల్ వాలింది... రైలుకూడా వస్తోంది." దూరంలో మేఘాలను చీల్చుకుంటూ ముందుకు తీవిగా నడుస్తోంది రైలుబండి. ఒక్కసారి ప్లాటుఫారం మీదవున్న వాళ్ళంతా — ఉత్సాహం, దుఃఖం, బాధ ఒకటేమిటీ యెన్నో అనుభూతులు పెనవేసుకుంటూండగా —' లేచారు. నా చుట్టూ నా మిత్రులు, కాలేజీ విద్యార్థులు, ఆచార్య అనసూయగారికి స్వాగతం చెప్పటానికి నిల్చున్నారు. నాలో ఉత్సాహం యే కోశానా లేదు. దుఃఖం కలిగింది. వాళ్ళ మధ్యనుంచి నేను మాయమవుతే యెంత బాగుంటుం దనిపించింది. కాని అలా జరగలేదు. మా ముందు ఒక ఫస్టుక్లాస్ పెట్టె నిలిచింది దానిలో ఎవరూ లేరు, ఒక్క స్త్రీ తప్ప. యెవరో అనుకున్నాను. అనసూయే — ప్రపంచంలో వున్న దీనత్వానికంతా వారసురాలై నట్లుండే ఆ కళ్ళను నేనెలా మరువగలను! అయినా ఆవిడలో చాలా మార్పు వచ్చిందనే చెప్పాలి. మొహంలో పూర్వంఉన్న కాంతి కిరణం క్షీణించింది. కానీ పెదవుల మీద చిరునవ్వు, నాశిక మీద మెరిసే అలజడి, వంపు తిరిగిన నుదిటిమీద, స్ఫుటంగా కనిపించే దృఢ సంకల్పం పూర్వం కన్నా యినుమడించాయనటానికి సందేహం లేదు.

రెండు దశాబ్దాల తర్వాత ఆమెను చూస్తున్నాను. అందరిలాగా ఆమె జీవించివుంటే యిప్పటికి నలుగురైదుగురైనా పిల్లలతో, సుఖాల్ని, కష్టాల్ని పంచుకోడానికి భర్తతో కాలం వెళ్ళబుచ్చుతూ వుండేది కాబోలు. నాలాంటి

వాళ్ళు యెప్పుడైనా ఇలాగ కనిపిస్తే భర్తవైపు చూసి ముసిముసి నవ్వులు నవ్వుతూ ''మా వారిని విశాఖపట్నానికి బదిలీ చేశారు. మా ఊరువచ్చి రెండు రోజులు వుండి పోకూడదూ ...'' అని ఆహ్వానించో, లేక "మా అమ్మాయికి పది హేనోయేడు వస్తోంది. ఎక్కడైనా మంచి సంబంధంచూసి పెట్టరూ — మీకు యెప్పటికీ ఋణపడి వుంటాము,'' అని ప్రాధేయపడి వుండేది కాబోలు. ఇవన్నీ నా గొంతెమ్మ కోరికలు. అనసూయ నాతో అలా మాట్లాడితే వినే అవకాశం నాకు కలుగలేదు. ఇలా అనుకో సాగాను. ఈలోపల బ్రహ్మానందం తరది తరులు, ఆమెకు సుస్వాగతం చెప్పి ప్లాటుఫారం దింపి టాక్సీలో ఎక్కిం చారు. నేను అప్పటిదాకా నోరు విప్పక పోవటం చూచి "నేను మీకు జ్ఞాపక మున్నానా'' అంది అనసూయ.

"మిమ్మల్ని మరిచిపోవడం యెలా సాధ్యం అనసూయగారూ..."అని ఎత్తి పొడుస్తూ మాట్లాడాడు బ్రహ్మానందం నావైపు చూస్తూ.

"ఈ ఊరు వదలివెళ్ళిన మీకు అలాగే వుంటుంది. నేను మీకు జ్ఞాపకమున్నం దుకు కృతజ్ఞత చెప్పాలి.'' అన్నాను నేను టాక్సీలో ఎక్కుతూ.

ఆరోజు సాయంత్రం క్లబ్బులో సభ దిగ్విజయంగా జరిగింది. ఆకాశంలో అక్కడక్కడా మబ్బులు ముసురు తున్నా సభ ప్రారంభించేసరికి ఆకాశం నిర్మలమై వాతావరణం హాయని పించింది. ప్రకృతిమాత చల్లని చూపులతో, నామిత్రులసహకారం కూడా ఆనాటి సభా విజయానికి తోడ్పడ్డాయి.

అనసూయ ఆసాయంత్రం యిచ్చిన ఉపన్యాసం 'మణిపూస.' అని చెప్పాలి. ఆవిడ సందేశమల్లా మనిషి బానిస అని మరిచిపోవాలి అని — అతనికి ఉండ కూడనిది 'భయం' అని. ఆవిడ మాట్లాడి నంతసేపూ బొమ్మలాగా కూచుని విన్నాను. కానీ, ఆమె చెప్పిన విషయం యెంతవరకు నిజం అని నాలో చాలా సేపు అంతర్యుద్ధం రేగింది అనసూయ యెంత వరకు తను చెప్పింది పాటించిందో నాకు అర్థంకాలేదు. ఆవిడకు నిజంగా ధైర్యం వుంటే యెందుకు కాలేజీలో చదువు కుంటున్నప్పుడు యిల్లువదలి వెళ్ళి పోయింది? తను ఎవ్వరి బానిసను కానని నిరయించటానికా?

తెల్లవారితే వెళ్ళిపోతుంది. అన సూయ. పొద్దున 8 గంటలకు బండి. అతను అప్పుడప్పుడు నా చెవికి అంద జేస్తున్న సందేశాలను బట్టి, బ్రహ్మానందా నికి అనసూయతో ప్రత్యేకంగా మాట్లా డాలని ఎన్నో సందేహాలను తీర్చుకో వాలని నాకు ప్రస్ఫుటంగా తెలిసింది. నిజం చెప్పాలంటే నాకూ కుతూహలం గానే వున్నది.

మేమిద్దరం భోజనమైన తరువాత అనసూయ మకాం చేసిన హోటలు కేసి దారి తీశాము. మేము గదిలోకి ప్రవేసించ గానే, మమ్మల్ని కూర్చోమని సంజ్ఞచేసి, కాఫీ ఉత్తర్వు చేసింది.

"గది బాగా విశాలంగావుందే..." అన్నాడు బ్రహ్మానంద...

'అవును యిది యిద్దరుండాల్సిన గది సింగిల్ రూమ్‌గా మార్చారు" అని అనసూయ అంటూండగానే కాఫీ కప్పు తెచ్చాడు బంట్రోతు.

"ఇదేమిటండీ మేము యిద్దరం మీ కళ్ళముందు కూర్చునుంటే ఒక్క కప్పు మాత్రమే ఆర్డరిచ్చారు. మే మేం పాపం చేశామండీ అనసూయగారూ" అన్నాడు బ్రహ్మానందం.

'అది మీ పాపం కాదండీ... నా పాపం, నేను కాఫీ ఆర్డరిచ్చాను. అతిధు లెవరూ నాకు వుండరను కుంటారు కాబోలు...ఒక కప్పే తెచ్చారు." అంది. వర్షించే మేఘంలా అయ్యాయి ఆవిడ కళ్ళు.

"యేం ఫర్వాలేదు. కాఫీకేం, యిప్పుడు తెప్పించుకోవచ్చుగా .." అని సమాధాన పరిచాను. ఆ మాటతో బ్రహ్మానందం నిజంగా బ్రహ్మానంద భరితుడయ్యాడు.

"అది అలా వుంచండి. ఇన్నాళ్ళు మీ రెక్కడున్నట్టు, యేం చేస్తున్నట్టు.." అని ఆలోచనా పూర్వకంగా కప్పువైపుకు చూడ్డం మొదలెట్టాడు. నేను చెయ్యలేని ధైర్యాన్ని బ్రహ్మానందం చేసినందుకు ఒక విధంగా సంతోషపడ్డాను. కానీ అనసూయ యిచ్చిన సమాధానము నా చెవికి బల్లెంలా గుచ్చుకున్నది.

"ఏమండీ, మనిషి చచ్చిపోయినా కొన్నాళ్ళయ్యే వ్పటికి అంత పట్టించు కోరు కదా...నా గురించి ఎందుకండీ. మీకంతా అమరా ..నేను చచ్చిపోయా నని నన్ను మరిచిపో కూడదా..."

అప్పుడు బ్రహ్మానందం అన్నమాటలు నా చెవుల్లో యింకా గింగురు మంటూనే వున్నాయి

"అనసూయగారూ, మనిషి చనిపోతే యే బాధాలేదు. కానీ అలా కాక ఒక వ్యక్తి జీవితం తెచ్చిపెట్టే సమస్యల్ని ధైర్యంగా యెదుర్కొని అనాయాసంగా పరిష్కరిస్తూ పురోగమిస్తున్నప్పుడు ఆ వ్యక్తి జీవితం ఆకర్షవంతం అవు తుంది..."

"నేను పురోగమించానో యేమిటో నేను ఎప్పుడూ ఆలోచించలేదు. కాని యేదీ చెయ్యలేనప్పుడు మనిషికీ మొండి ధైర్యం వొస్తుంది. యేదో ఒకటి చేసే స్తాడు. నా విషయంలోనూ అదే జరిగింది. మీకు తెలిసే వుంటుందను కుంటాను, నేను పుట్టిన రెణ్ణెల్లకే మా అమ్మ పోయింది"

"మరి ఆవిడ యెవరూ..."అన్నాను. వాళ్ళింట్లో రుసరుస లాడుతూ వుండే

ఒక మధ్య-వయస్కు రాలిని మనస్సుకు తెచ్చుకుంటూ

"ఆవిడ మా పిన్ని. మా నాన్నకు నా పైన తల్లిలేని పిల్లని యెంతో వక్షువ వుండేది. కాని మా పిన్నితో పోట్లాటలు పెట్టుకొని సంసారాన్ని వీధుల్లోకి యీడవడం యిష్టం లేక నేను పడే బాధల్ని మౌనంగా చూస్తూ ఊరుకొనే వాడు. యెన్ని రోజులు నేను పస్తులు మాడేనో తలుచుకుంటే, అసలు యెల్లా బతికానా అనిపిస్తుంది. కానీ యేదో శక్తి నాకు యెప్పటికప్పుడు ధైర్యం చెప్తూండేది...

"దిక్కులేని వారికి దేముడే దిక్కు అంటూంటాం చూడండి. అది యెంత నిజం! నేను కాలేజీలో చేరాను. ఎలాగో పుస్తకాలు సరిగా వుండీ లేక నా చదువు సాగాల్సి వచ్చింది. మా పక్కింటిలోనే వుంటూ వొచ్చారు రామానుజంగారు. ఇంగ్లీషు చెప్తూ వుండేవారు. నేను పడుతున్న యిబ్బందులు వారి చెవికి వచ్చాయేమో ఒకరోజు నన్ను పిలిచి, ఆయన దగ్గిర ఇంగ్లీషు పుస్తకాలు రెండు పెట్టివున్నాయని, ఒకటి కావలిస్తే నన్ను తీసుకోమని చెప్పారు. ఆయన నాకు చేస్తున్న దానికి యెలా కృతజ్ఞత చెప్పాలో తెలియలేదు. కాని ఆ సాయంత్రం నా దగ్గిరవున్న పుస్తకాల్ని చూసి మా పిన్ని అన్నమాటలు నన్ను నిశ్చేష్టురాలిని చేశాయి. "ఇదిగో అంత ఇదైతే, ఆ పుస్తకా లిచ్చిన వాడితో లేచిపోరాదూ" అన్నది. నేను నిల్చున్న భూమి యెందుకు చీలి నే నందులోకి ఎందుకు పూడుకు పోలేదో తెలియ లేదు. నాకు పిచ్చిపట్టినట్టయింది. ఆ యింట్లో కాలం గడపటం దుర్భర మనిపించింది. అనుకుంటూండగానే రామానుజంగారికి ఢిల్లీలో ఉద్యోగం దొరికింది. ఆయన రేపు వెళ్తారనగా నేను ధైర్యం చేసి ఆయన దగ్గిరకు వెళ్ళాను నాలో పేరుకున్న ఆవేదనంతా ఆయనతో చెప్పుకున్నాను నాకు కావల్సిన సానుభూతి దొరికింది "మీతో యెవరూ లేరుగా. నేను మీతో వస్తేతప్పా" అన్నాను. ఆయన లోపల యేమను కున్నారో యేమోనని భయపడ్డాను. కానీ ఆయన యేమీ చలించకుండా "సరే" నన్నారు. అలా జరిగింది నేను ఈ ఊరు వదిలి వెళ్ళడం" ఆమె మాటలు వింటూంటే నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"అయితే మీరు రామానుజాన్ని ప్రేమించారా" అనడిగాడు బ్రహ్మానందం.

"'ప్రేమ' యేమిటో ... వారు నన్ను ఆదరించారు అని మాత్రం చెప్పగలను. మీరు ఒక్క విషయం గమనించాలి వారికీ నాకూ మధ్య, వయస్సులో ముప్ఫయి ఒక్క సంవత్సరాలు తేడా. నేను వెళ్ళిన రోజున ఆయన వయస్సు నలభై యేడు. నా వయస్సు పదహారు. ప్రేమకు యే బంధం అడ్డురాకపోవచ్చు. వయోభేదం కూడా అంత పట్టింపు కాకపోవచ్చు..."

"మరయితే రామానుజం మిమ్మల్ని ప్రేమించారా..."

"అదే అసలు విషయం. ఆయన నన్ను పెళ్ళి చేసుకోమని కోరినా నేను ఒప్పుకుని వుండే దాన్ని. యే మాటా అనలేదు. అలా జరిగిపోతూ వచ్చింది. జ్ఞాపకం చేసుకుంటే ఒక్క సంవత్సరం కాలం ఆలా జరిగింది. నాకు తోడుగా ఒక వంటలక్క యెప్పుడూ అండగా వుంటూ వచ్చింది...యిలా కాలం గడుస్తుంటే మరొక వ్యక్తి మా జీవితంతో ప్రవేశించాడు..."

"ఎవరండీ" అన్నాను ఉబలాటం ఆపుకోలేక.

"అతని పేరు మాధవ్. రామానుజం గారివద్ద పాఠాలు చెప్పుకోడానికి వస్తూండేవాడు"

"మీరు కొంపదీసి అతన్ని ప్రేమించలేదుగదా..." అన్నాడు. బ్రహ్మానందం.

"జరిగిన పొరబాటే అక్కడ జరిగింది."

"ఏం పొరబాటండీ" అన్నాడు బ్రహ్మానందం.

"అతను నా కళ్ళల్లో మెదుల్తూండేవాడు. పదేపదే అతన్ని చూడాలనిపించేది. ఇంతకు పూర్వం మీరు వయస్సు గురించి యేదో అన్నారు. ఎంత తెలివి తక్కువగా ప్రవర్తించానో తలుకుంటే సిగ్గుగా వుంటుంది. ఒకరోజు మాధవుకు కాఫీ, ఫలహారము ఇచ్చాను, అతన్ని చూస్తూ. అతను నా వైపు చూడకుండా నేను పెట్టినదంతా సుష్టుగా తినేసి, కాఫీ గటగటా తాగేశాడు.

'ఈ రోజు మీ భర్తగారు లేరా' అన్నాడు. 'నా భర్త, నా భర్తెవరూ' అనడిగాను. అతనికి ఆశ్చర్యం వేసింది. 'అదే రామానుజంగారు' అన్నాడు. 'ఆ విషయం నీకెందుకూ' అన్నాను. దాని మీద అతనికి తొట్రుపాటు కల్గింది. 'పోనీ నాకు పెళ్ళికాకుంటే నీవు పెళ్ళి చేసుకుంటావా?' అని అడిగాను. 'అది సరే, మరి రామానుజంగారెవరూ?' అన్నాడు. 'ఆయన నా భర్త కాదు. ఆయన మీద నాకుండేదల్లా భక్తి మాత్రమే. అదలా వుంచి నిన్నొక విషయం అడగనా...' నేను వాక్యం పూర్తి చేయకుండానే మాధవు లేచి వెళ్ళిపోయాడు. అంతే. అదే ఆఖరుసారి అతన్ని నేను చూడటం. రామానుజంగారు సాయంత్రం వచ్చారు. నేను పరధ్యాన్నంగా వుండటము చూసి 'మాధవు ఈ రోజు వచ్చాడా' అని అడిగారు. జరిగిందంతా చెప్పాను. 'వాడు వట్టి గాజువంటి మనిషి...సరే ఏం చేస్తాం' అని మాత్రం అన్నారు. ప్రొద్దునే లేచి చూచాను. రామానుజంగారి పెట్టె, బెడ్డింగు మాయమయినాయి. టేబిల్ మీద ఒక జాబులో ఇలావుంది. "నిన్ను ఒంటరిదాన్ని చేసి వెడుతున్నందుకు బాధగా వుంది. కానీ

మన్నిద్దరి జీవితాలు రైలు పట్టాల్లాగా కలుసుకోలేవు. దూరం నుంచి రైలు పట్టాలు కలుసుకున్నట్లు కనిపిస్తాయి. కానీ అది ఒట్టి భ్రమమాత్రమే. నీకు, నీ కాళ్ళ మీద నిలబడే చదువూ, శక్తి వచ్చాయి. నీవు జీవితం ధైర్యంగా గడపగలవని ధైర్యం నాకు వుంది. నిన్ను ఆశీర్వదిస్తూ సెలవు తీసుకుంటున్నాను'. అలా నేను మాత్రమే ఇంట్లో మిగిలాను. ఆయన చెప్పిన ప్రతి మాటలోనూ ఎంతో సత్య ముంది."

బ్రహ్మానందం, నేను, నిర్జీవంగా, బదులు చెప్పలేక సిగ్గుతో తలవంచు కున్నాము. బ్రహ్మానందం కంట్లోనుంచి వచ్చే అశ్రువుల్ని ప్రక్కకు తిరిగి తుడుచుకున్నాడు. గద్గదమైన కంఠంతో "అనసూయగారూ : మీరు నన్ను క్షమిం చాలి'' అన్నాడు.

"చాలా పొద్దుపోయింది. రేపు పొద్దున యెక్స్‌ప్రెస్‌కు వచ్చి లేపుతాము'' అని నేను, బ్రహ్మానందం మౌనంగా బయల్దే రాం. ప్రొద్దున రైలు పెట్టెలో అనసూయ గారిని యెక్కిస్తున్నప్పుడు, ఆ పెట్టెలో ఎవ్వరూ లేరు. రైలు బయలు దేరే టప్పుడు బ్రహ్మానందం అన్నాడు.

"ఈ పెట్టెలో యింకెవరూ ఉన్నట్టు లేరండీ"

"అదేమంత ఆశ్చర్యం కాదులెండి''

"అదేమిటీ...?''

"నేను వచ్చేటప్పుడు కూడా అలాగే జరిగింది. ఢిల్లీలో యెవరో ఒకాయన యెక్కారు పెట్టెలో. తోడు ఉన్నారుగదా అనుకున్నాను. కాని ఆయన ఆగ్రాలో దిగిపోయారు. ఇక్కడి దాకా నేను ఒంటరిగా ప్రయాణం చేశాను..."

"కాని వెళ్ళేటప్పుడూ ఒంటరి ప్రయాణమే..."

''అలాగే వుంది...కాని నేను బాగా అలవాటు పడ్డాను లెండి...యేం ఫర్వా లేదు'' అంటుండగానే రైలు హుషారుగా బయలు దేరింది. మేము కృతజ్ఞతా పూర్వ కంగా హస్తాలు ముకుళించాము. ★





# భావకవిత్వంలో శృంగారనాయికలు

# ఎంకి

డా॥ సి. నారాయణ రెడ్డి

భావకవిత్వంలోని శృంగార నాయికల్లో ఎంకి విలక్షణమైంది. ఊర్వశి, శశికళ మున్నగువారు వెన్నెల నురుగులు పోతవోసిన మూర్తులు. వారికీ యెంకికీ ఎక్కడా పోలికలేదు. ఎంకి అడవిమల్లె లాంటిది. ఊర్వశ్యాదులు నందనమందార సుమాల్లాంటివారు. ఎంకి అడవిమల్లె లాంటిదైనా అంతరంగంలో పారిజాత పరిమళాలు గుబాళిస్తాయి. వాటి నంటు

కొనే మృత్ప్నగంధం గుప్పుమనడం ఆవిడ అంతర్వృత్తి విశేషం.

'గుండె గొంతుకలోన కొట్లాడుతాది
కూకుండనీదురా కూసింత సేపు'

అన్న పాటతో ఎంకి తెలుగు గడ్డలో అవతరించింది. అయితే ఆమె బాల్యాదుల గురించి మనకు తెలియదు. ఆమె అవతరణమే తరుణవయోదశలో జరిగినట్లనిపిస్తుంది. ఈ పాటతోనే నండూరి సుబ్బారావుగారి గొంతు ముడి విడిపోయింది వసంతంలో తొలి తొలి చివుళ్ళను తిని జీరవదలిన గొంతుతో కుహూ కూజితాలను ఆలపించే పుంస్కోకిలంలాగా నండూరివారు క్రమంగా ఎంకి పాటలను వినిపించారు. భాషలో, భావంలో, వస్తువులో, ఛందస్సులో, పదవరణంలో అపూర్వ నవ్యతను సంతరించుకున్న రస గీతాలను అవతరింపజేశారు.

సుబ్బారావుగారు ఎంకి పాటలు వ్రాసే నాటికి గురజాడ, రాయప్రోలు, అబ్బూరి, వెంకటపార్వతీశ్వరులు కవితా లోకంలో కొత్తపాతల మేలుకలయికతో క్రొమ్మెరుగులు చిమ్ముతున్నారు వల్లూరి జగన్నాథరావుగారి కోడి పాటలతో, గొల్ల పాటలతో, చల్ మోహనరంగా లాంటి జానపద గేయాలతో యువలోకం పులకితమైపోతున్నది. నండూరివారు మొదటి రోజుల్లో వల్లూరి జగన్నాథరావుగారి పాటలను గొంతెత్తి కమ్మగా పాడి వినిపిస్తుండేవారట. ఒకవైపు ఆంగ్ల విద్యాభ్యాసంవల్ల వర్డ్సువర్తు, బర్న్సు, షెల్లీ, కీట్సు మున్నగు కాల్పనిక కవుల ప్రణయ గీతాలు చదివే అవకాశం కలిగింది. ఇంకోవైపు చల్ మోహనరంగా లాంటి తెలుగు జానపద గేయాలు అతని తరుణ హృదయంలో పులకలు పేర్చాయి. ఈ ప్రభావాల సమష్టి స్వరూపమే ఎంకి పాటల అవతరణం. ముఖ్యంగా బర్న్సు కవి ఇంగ్లీషులో వ్రాసిన గీతాలు నండూరివారిని బాగా ఆకర్షించాయి. బర్న్సు స్కాట్లండు దేశంలో పుట్టిన కవి. ఈ కవి తాను పుట్టిన గడ్డలోని మాండలికాలనూ, నుడికారాలను గ్రహించి జానపద గేయాల్లాంటి రసవత్తర గీతాలు రచించాడు. బర్న్సు కలం పట్టకముందు స్కాచ్ భాషను స్కాట్లండు దేశీయులే ఏవగించుకునేవారట. వర్రి మట్టియని అందరనుకుంటున్న భాషలో వజ్రమాణిక్య కాంతులను వెలార్చాడు బర్న్సు. స్కాంట్లండులోని కర్షక భాషనూ, జానపద సంగీతాన్ని సముచిత రీతిలో శ్రుతిచేసుకొని బర్న్సు రచించిన పాటలు త్వరలోనే స్వదేశీయుల విదేశీయుల మన్ననల నందుకున్నాయి. బర్న్సులాగే నండూరివారు 'తూర్పు కాపువారి యాసలో, దేశీయమైన పలుకుబడితో, జానపద గేయాల వరుసల్లో పాటలువ్రాసి విప్లవం సాధించారు. విషయం సూటిగా గుండెకు తగిలేట్టు చెప్పడంలో వీరు

హౌస్‌మన్ (Housman) పద్ధతి నవలం బించారు. చిన్న చిన్న మాటలతో మిన్నుల్ని తాకే ఔన్నత్యం సాధించడంలో గాథాసప్తశతికారుణ్నీ, అమరుకుణ్నీ అందుకున్నారు.

ఎంకిపాటల్లో భాష చాలావరకు జానపదం. భావాలు ఏవోకొన్ని తప్ప చాలా వరకు నాగరకులవే. ఈ పాటల్లో కొంత దూరం పోయిన తర్వాత నాయికానాయకులు నిమిత్తమాత్రులవుతారు. నండూరివారు తమ ప్రణయానుభూతులనే ఆ పాత్రల రూపంలో వెలిబుచ్చారు. "ఎంకి నా ప్రేమ రసానికాశ్రయము; నా శృంగార వాక్కునకు విశ్రామస్థానము; నా వలపులకు నిధానము"* అని వారే స్వయంగా వ్రాసుకున్నారు. ఎంకి పాటల్లో మొదటి కొన్ని పాటల్లో యెంకి కేవలం జానపద కన్యలా కనిపిస్తుంది. 'కన్ను గిలికిస్తాది, నన్ను బులిపిస్తాది, దగ్గిరసకూకుంటే సిగ్గు సూస్తాది' అన్నప్పుడు, 'జాము రేతిరి యేళ జడుపు గిడుపూ మాని' నాయుడు బావ చేనిలో వుండగా యెంకి 'నీలి సీరా గట్టి నీటుగా' వచ్చినప్పుడు, 'నీ నీడలోనె మేడ కడతా నాయుడు బావా' అన్నప్పుడు ఎంకిలో అచ్చమైన పల్లెటూరి పిల్లవాలకమే అగుపిస్తుంది.



* ఎంకి పాటల గాలి దుమారము (వ్యాసం) ఆంధ్ర పత్రిక ఉగాది సంచిక: 1926.

ఈ దశలో ఎంకి నాయుడు బావలు కేవలం ప్రేమికులు. వారి కప్పటికి పెళ్ళి కాలేదు. 'గుండె గొంతుకలోన' అనే పాటలో, 'హానలచ్చిమి' అన్న పాటలో, ' ఎంకి నాయుడు బావను 'మందొ మాకో యెట్టి మరిగించినా' వంటి మాటలు ఉంపుడుకత్తెలకు మాత్రమే చెల్లుతా యని బసవరాజు అప్పారావుగారు విమర్శించారు. ఈ విమర్శ సమంజసమైందికాదు. ఎంకి పరకీయకాదు. తాను



మనసిచ్చిన, వాని కొరకు ఆందోళనపడ్డ కన్య. కొన్నాళ్లకు వారికి వివాహమైంది. కన్ను గిలికించడం, బులిపించడం తగ్గిపోయాయి. తన భర్త ఊరికి వెళ్ళి అన్న గడువు మేరకు తిరిగిరాక పోయేసరికి ఆవిడ 'వొళ్లంత ఉలికులికిపడి' నట్లు కలతపడింది. 'నా యెనక ఎవరోను వడిసిం' ట్లుంటుందని పరితపించింది. అడుగడుగునా తన భర్తే కళ్లకు గట్టినట్లు ఆవిడకు స్ఫురించింది. ఈ దశలో యెంకి 'రానోరింటికైనా రంగుతెచ్చే పిల్ల'. ఆమె కళ్ళెత్తితే సాలు కనకాబి 'సేకాలు'. ఆవిడ 'పదము పాడినదంటే' పాపాలు పటాపంచలై పోవాలి.

పెళ్ళి తర్వాత యెంకీ నాయుడు బావల దాంపత్య జీవితం ధర్మనిష్ఠమై పోయింది. ఇరువురూ కలిసి భద్రాద్రిని దరిసించారు. తిరుపతిని సేవించారు. ఎంకికి క్రమంగా 'సంకలో సంబ్రాలు పడు' కుర్రవాడు పుట్టాడు. ఆ తర్వాత ఆవిడ భవభూతి అన్నట్లుగా 'ఇయం గేహేలక్ష్మీ రియమమృత వర్తిర్నయనయోః' అన్న స్థాయి నందుకున్నది. అందుకే తరువాతి పాటల్లో నాయుడు బావ భక్తుడుగా, ఎంకి దేవతగా అగుపిస్తారు. అలంకార శాస్త్రరీత్యా ఎంకి అష్టవిధ నాయికల్లోని స్వాధీన పతిక. 'ఈ రేయినన్నొల్ల నేరవారాజా' అనే పాటలో మాత్రం విప్రలబ్ధ లక్షణం కనిపిస్తుంది. ఈ పాటల్లో దేనికదే ఒక రసవత్కావ్యం. ప్రతి గేయంలో ఇద్దరిలో ఒకరు ఆలంబన విభావంగా ఉన్నారు. ఉద్దీపన విభావాలున్నాయి. అశ్రుపాతాద్యనుభావాలున్నాయి. సంచారి భావాలున్నాయి. ఆలంకారిక దృష్టితో చూచినా ప్రతి పాటలో రసనిష్పత్తికి వీలుంది.

మాధురీ ధురీణమైన దాంపత్య ధర్మానికి అసలైన ప్రతీక యెంకి. జానపదాంగనయైనా ఆవిడలో పూర్వజన్మార్తమైన సంస్కార బలముంది. 'యెలుతురంతా మేసి యేరు నెమరేసింది', 'ఎన్నెలల సొగసంత యేటి పాలేనటర' వంటి స్వగతాల్లో ఆవిడ ఊహాసౌందర్యం వ్యక్తమవుతుంది.

'సికలోన సిక కలిపి, మొకము మొకమూ
కలిపి
వెలుగు దేవతకు చక్కిలిగింత పెట్టింది.'

వంటి చరణాల్లో ఆవిడ ఆత్మోన్నత్యం ధ్వనిస్తుంది. అలాగే 'సూపుతో మాటాడి వూపిరితొ తెనిగించు' అనే గేయ భాగంలో ఆవిడ కుశాగ్ర ధిషణ బయట

పడుతుంది. 'గొవు మా లచ్చిమి' అన్న పాటలో యెంకి నాయుడు బావల గార్హస్త్య ధర్మం ఎంతో చక్కగా నిరూపింపబడింది. దీన్లో గోవు లక్ష్మిగా రూపింపబడింది. లక్ష్మీదేవి ఐశ్వర్యానికీ అభ్యుదయానికీ సంకేతం. గోవు చతుర్విధ పురుషార్థాల్లో గరీయసమైన ధర్మానికి అధిష్ఠానం. నాయుడు బావ యెంకితో పాటు కూర్చొని కథలు చెబుతుంటే గోవు తలాడించిందట. అంటే వాళ్ళ కామ ప్రవృత్తిని ధర్మదేవత గమనించి ఆమోదించిందన్నమాట. యెంకి సరసాలాడటానికి జంకుతూ వుంటే గోవు 'సూసి సూడక కన్నుమూసి తెరిసే' దట. అంటే ధర్మబద్ధమైన కామం పట్ల తనకున్న ప్రసన్నబుద్ధిని ప్రకటించిందన్న మాట. వారిద్దరు ఎన్నడైనా పోట్లాడుకుంటే గోవు తెల్లవోతుంది. ధర్మశృంగారాన్ని ఆచరించే దంపతులు ప్రణయ కలహంలో పడడం చూచి గోలక్ష్మి విభ్రాంతయైందని దీని తాత్పర్యం. ఈ చిన్న గేయం ఉదాత్తమైన ధర్మ శృంగారాన్ని ఎంతో ధ్వని రమ్యంగా చిత్రిస్తుంది.

'ఆరిపేయవె దీపము' 'లేపకే నా యెంకి' వంటిపాటల్లో ఇంద్రియాతీతమైన సౌందర్యమూ, స్వచ్ఛ ప్రణయమూ నిక్షేపింపబడినాయి. ప్రథమ దశలో ప్రవాసంలో వున్న తన భర్తను గూర్చి 'దూరాన నా రాజు కేరాయిదౌనో' అని విలపించి, 'సీమ సిటుకనగానె సెదిరి' పోయే వెన్న మనసున్న యెంకి క్రమ క్రమంగా 'కళ్లలో చందురుని కైమగొని నిదురించు' పరిణత దశ నందుకుంది. అయితే నాటికీ నేటికీ ఎంకి 'యెల్తురుపిల్ల.' తాను ఎదుట నిలిస్తే కాశీదేవుణ్నే తల తడుముకునేట్లుచేయగలసౌందర్యమూర్తి.

యెంకి పాటల్లోని నాయికా నాయకుల గూర్చి కొందరు పండితులు అమూల్యాభిప్రాయాలు వెల్లడించారు. పురాణం సూరిశాస్త్రిగారు ఎంకి, నాయుడు బావలంటే ఎవరో కారు జీవేశ్వరులే అని అన్నారు. పంచాగ్నుల వారు వీరిని శృంగార రసాధిష్ఠాన దేవతలగు రతీ మన్మథులని అన్నారు. రంభా నలకూబరులు అలంకార శాస్త్ర విరుద్ధంగా శృంగార సల్లాపంచేసిన దోషం వల్ల కలియుగంలో ఎంకి నాయుడు బావలుగా జన్మించారని వేదం వెంకటరాయ శాస్త్రి గారు చమత్కరించారు. ఇంకా గిడుగు, వేటూరి మల్లంపల్లి, వేదుల ప్రభృతులు ఎంకి పాటల్లోని ప్రాశస్త్యాన్ని వివరించారు. పొక్కూలూరి లక్ష్మీనారాయణ

వంటి వారు ఎంకి, నాయుడు బావల్ని సంకర దంపతులని నిదించినా వారి పవిత్ర దాంపత్యాని కేమాత్రం పొచ్చెముచ్చు కలుగలేదు అలాగే ఉమాకాంత పండితులు ఈ పాటల్ని 'చంద్రయ్య నారాయణమ్మ' పాటల శ్రేణిలోకి విసిరేసినా ఇవి 'ఆంధ్ర ధ్వన్యాలోకం' లాంటి లక్షణ గ్రంథాలకే శిరోధార్యం కాక తప్పలేదు ఇంక సాహిత్యలోకంలో వీటి ప్రభావం చెప్పనక్కర లేదు ఈ పాటల ననుసరించి గడచిన నాలుగు దశాబ్దాలుగా లచ్చి పాటలు సీతి పాటలు, లంబాడి పాటలు, కాపు పాటలు మున్నగునవెన్నో వెలువడినా ఇవి యెంకి పాటల నీడల్ని గూడ అందుకో లేక పోయాయి ఈ పాటల ధోరణిలోనే వెలువడి, మౌలికత కోలుపోకుండా రసాత్మలను రంజింప జేసినవి కొనకళ్ళ వెంకటరత్నంగారి 'బంగారి మామ పాటలు' ఇవి ఇటీవలే పుస్తక రూపంలో వచ్చాయి అంతకు ముందు పత్రికల ద్వారా, రేడియో ద్వారా, సభల ద్వారా అశేష ప్రచారాన్ని పొందాయి వీటిలో నాయకుడు 'బంగారి మామ' నాయిక పేరులేదు 'కోడలు పిల్ల' అని మాత్ర ముంది అందువల్ల ఈ పాటల్లోని నాయికను గురించి చర్చ చేయవలసిన వీలు కలగలేదు ఇంతటి చక్కటి పాటలకు తొలి ఊపిరులు ఎంకి పాటల ద్వారానే అందాయి ఎంకి పాటలద్వారా కవితా లోకంలో ఒక కొత్త ప్రయోగం చేసి, శృంగార నాయికా జగత్తు కొక కలికితురాయిని కైసేసిన నండూరి వారి ప్రతిభ నాన్యతసాధ్యం ★



Printed and Published by A Sudhakar Rao from Yuva Press, 5 9-88, Public Garden Road, Hyderabad-1 Controlling Editor Sri "CHAKRAPANI"